## యోనివ్యాధి చికిత్స

1. భూతులసి వేళ్లు, 2. పిప్పళ్లు,

వీటిని కల్కముగా బుచ్చుకొని ఆ మీాద సారాద్రాగించవలెను.

### మరియొకటి

1. పిప్పళ్ళు, 2. నల్లజీలకఱ్ఱ,

వీటిని కల్కముగా బుచ్చుకొని ఆమీాద సారాద్రాగించవలెను,

### మరియొకటి

సౌవర్చ లవణమును కల్కముగా బుచ్చుకొని ఆమీాద సారాద్రాగిం[1]చవలెను.

## క్షాళనయోగము

యోని శూలకు [2]యోనికందలకు ఆరగ్వధాదిగణము[3]తో సేచనము చేయవలెను.

## బలాధాన్వంతరతైలము

చిట్టాముట్టివేళ్ళ కషాయము 6–ప్రస్తములు. పాలు 6–ప్రస్థములు దశమూలములు, ప్రత్తిగింజలు, యవలు, ఉలవలు, [4]వీటితో కాచిన కషాయము ఒక ప్రస్తము, నూనె ఒక ప్రస్తము,

కల్కద్ర[5]వ్యములు.

1. మేద, 2. మహా మేద,
3. సరళ దేవదారు, 4. మంజిష్ఠ,
5. కాకోళి, 6. క్షీరకాకోళి,
7. శ్రీగంధము, 8. సుగంధి వేళ్లు,
9. చంగల్వకోష్టువు, 10. గ్రం[7]ధి తగరము,
11. జీవకము,

---

1. యోని శూలకున్నూ మందానకున్నూ
2. చేది
3. మందానకున్నూ
4. చేతమాన్నైది
5. కూడాకాచిన
6. వ్యాలు
7. ధ్య

12. ఋషభ[1]కము, 13. సైంధవలవణము,
14. నల్ల సుగంధి పాల, 15. కరంబుప్వు,
16. వస, 17. అగరు,
18. గవిజేరు వేళ్లు, 19. పెన్నేరు[2]గడ్డ,
20. పొత్తి దుంప, 21. నేలగుమ్మడిదుంప,
22. అతిమధురము, 23. సదాప విత్తులు,
24. కారు పెసర, 25. యాలకులు,
26. లవంగపు చెక్క, 27. పత్రకము,

ఇవి సమాంశలు. నూనెకు [3]ఆరవ భాగము కల్కముగబెట్టి కాచిన తైలముతో పానాభ్యంగములు [4]చేసిన యోని రో[5]గములు, సూతికా దోషములు, బాల రోగములు, మర్మగత, అస్థిగత, శోషములు, జ్వర గుల్మములు, గ్రహోన్మాదము, మూత్రఘాతము, చేరుకట్టు, వాయువులు, ఇవి[6]నయమగును.

మంజిష్ఠాదిఘృతము

1. మంజిష్ట, 2. చెంగల్వ కోష్టుపు,
3. గ్ర[7]ంధి తగరము, 4. త్రిఫ[8]లములు.
5. శర్కర, 6. వస,
7. మాను టసువు, 8. పసుపు,
9. అతిమధు[9]రము, 10. మేద,
11. మహా మేద, 12. [10]ఓమము,
13. కటుకరోహిణి, 14. కోడిశ పాల,
15. ఇంగువ 16. కాకోళి,
17. పెన్నేరు గడ్డ, 18. చల్ల గడ్డలు,

---

1. వృ
2. ం
3. దుంప
4. రో
5. చేసిన
6. గా
7. మానును
8. ధ్య
9. లా
10. కం
11. వోమం
12. ల

ఇవి సమాంశలు. నేతికి 4వ-భాగముగ కూర్చి, కల్కముగ బెట్టి కాచిన ఘృత్యమును సేవించిన యోనిదోష[1]ములు, శుక్లదోష[2]ములు శమించును.[3]

ఋతుస్నానముచేసిన వెంటనే ఈ ఘృతమును సేవించిన గర్భము కలుగును.

## నారసింహచూర్ణము

శ్లో. ప్రస్థం శతావరీచూర్ణం ప్రస్థం గోక్షురకస్య చ ।
వారాహ్యా వింశతిపలం గుడూచ్యాః[4]పంచవింశతిః ॥
భల్లాతకానాం ద్వాత్రింశత్ చిత్రకస్య [5]దశైవ చ ।
తిలానాం లుంచితానాం చ ప్రస్థం సమ్యగ్విచూర్ణితమ్ ।
త్ర్యూషణస్య పలాన్య[6]ష్టౌ శ[7]ర్కరాయాశ్చ సప్తతిః ॥
మాక్షి[8]కం శర్కరార్ధం చ మధునోఽర్ధం చ గోఘృతమ్ ॥
శతావరీసమం దేయం విదారీకంద చూ[9]ర్ణకమ్ ॥
త్రిఫలాయాః శోధితాయాః ప్రస్థమేకం విచూర్ణితమ్ ।
సర్వాణ్యేతాని సంసృజ్య స్నిగ్ధభాండే వినిక్షిపేత్ ॥
పలార్ధం చ పలం యు[10]ంజ్యాదభీష్టం చాత్ర భోజనమ్ ।
మాసద్వయ ప్రయోగేణ శతం జీవతి నీరుజః ॥

## [11]దానిగుణములు

శ్లో. సకాంచనాభో మృగరాజవిక్రమ-
స్తురంగవేగాధిక వేగయుక్తః ।
స్త్రీణాం శతం గచ్ఛతి యౌవనస్థం
శ్రీనారసింహాహ్వయచూర్ణసేవీ ॥

---

1. షా
2. షా
3. యీఘృ స్త్రీస్నాల్నాడు (నాల్గోనాడు) చేసే సేవించినను సంతానం గల్గను
4. శతధైవచ
5. తధైవచ
6. ష్టా
7. ర్క
8. క్షైశ్మరార్ధ
9. ర్ణతం
10. ంజియ
11. తద్గుణము

1. పిల్లి తేగవేళ్లపొడి, ఒక ప్రస్థము, 2. పల్లేరు వేళ్లపొడి ఒక ప్రస్థము 3. తాడిదుంపలపొడి 20 పలములు 4. తిప్పతీగపొడి 20 పలములు 5. జీడిగింజలపొడి [1]32 పలములు 6. చిత్రమూలపు చూర్ణము [2]10 పలములు 7. నువ్వుపప్పుపొడి [3]ఒక ప్రస్థము 8. త్రికటుక చూర్ణము 8 పలములు 9. పంచదార [4]70 పలములు 10. తేనె 35 పలములు 11, ఆవునెయ్యి 17½ పలములు 12. నేలగుమ్మడి గడ్డలపొడి [5]ఒక ప్రస్థము, 13. త్రిఫలచూర్ణము [6]ఒకప్రస్థము

వీటిని కలిపి [7]చెమర్చకుండ బెట్టి ప్రతిదినము రెండు నెలలు సేవివించిన [8]సర్వరోగములు శమించి నూరు సంవత్సరములు బ్రతుకును.

[9]యథేష్టముగ భోజనము చే[10]యవలెను. సువర్ణకాంతి గలిగి సింహపరాక్రమము గలిగి అశ్వవేగము గలిగి నూరుగురు స్త్రీలనైనను పిచ్చుకవలె రమించును. [11]పరాక్రమవంతులైన పుత్రులు గలుగుదురు.

## వాజీకరయోగము

1. పల్లేరువిత్తులు, 2. గొబ్బివిత్తులు, 3. పిల్లితేగలు, 4, దూలగొండి విత్తులు, 5. నువ్వులు, 6. మినుములు,

యివి [12]సమముగ చూర్ణముచేసి పంచదార సమేతముగ క[2]ర్ష మెత్తు ఆవుపాలతో సేవించిన మదించిన స్త్రీలను నూరుగురిని రమించ సత్తువ గలుగును.

---

1. ప ౨౨
2. ప ౩౨
3. సం ౧౦
4. చ ౭
5. ప ౭౦
6. ఫ ౩౫
7. ప ౧౨
8 సం ౦
9. సం ౦
10. చమురు
11. రోగాలు
12. లెస్సగా
13. సేది
14. వీర పుత్రులను
15. గాంచి యీనారసంహ చూర్ణము చేత బ్రతుకు దురు
16. సరిగా
17. రస

శో[3]ఫలకు

శ్లో. కాసమర్దస్య బీజాని తన్మూలం బలి చందనమ్ ।
మూషపాషాణసంయుక్తం [1]లేపః శోఫనివారణః ॥

1. కసివింద విత్తులు, 2. కసివింద వేరు, 3. గంధకము, 4. శ్రీగంధము, 5. యిల్లిపాషాణము

ఇవి సమాంశలు. వీటిని నీళ్ళతో నూరి లేపన[2]ముచేసిన శోఫలు కుష్ఠువులు [3]నయమగును.

మూత్రకృచ్ఛ్రనిధానము

శ్లో. అ[4]ష్టౌ స్యుర్మూత్రకృచ్ఛ్రాణి రూక్షతీక్ష్ణోష్ణ [5]భోజనాత్ ।
వాతాత్సశూలం స్రవతి మూత్రం పిత్తేన దాహ[6]వత్ ॥
కఫేన శీతలం సాంద్రం దుశ్చికిత్స్యం త్రిదోషజమ్ ।
రక్తజం రక్తసంస్రా[7]వి శుక్లసంస్రావి శుక్లజమ్ ॥
అశ్మ[8]శ్మా వ[9]స్థిగతో భి[10]న్నోఽసా [11]శర్కరాశ్మరీ ।

రూక్షద్ర[12]వ్యముల చేతను, తీక్ష్ణద్ర[13]వ్యముల చేతను, ఉష్ణద్రవ్య ములచేతను, ఉష్ణభో[14]జనముల చేతను మూత్రకృచ్ఛ్రము ఎనిమిది [15]విధములు.

వాయువువలన నొప్పిగలిగి స్రవించును. పైత్యము వలన మంట గలిగి స్రవించును. శ్లేష్మమువలన చల్లనై చిక్కనై స్రవించును. త్రిదోషజము యీమూడు వి[16]ధములుగ [18]స్రవించును. అది అసాధ్యము. రక్త

---

1. భ
2. లేపేస్స్నిగ్ధనివారణమ్
3. ంచేస్తే
4. మానును
5. అ ష్టౌ స్యు న్మూ త్ర కృచ్ఛ్రాది
6. దోదనాత్
7. యే
8. ది
9. ది
10. శ్మరి
11. స్థి
12. న్నాహతో
13. భ
14. వ్యా
15. జ
16. భేదాదాలై పుట్టును
17. ధాల
18. వెళ్లును

మువల్ల బుట్టి[1]న రక్తము స్రవించును. శుక్లము వలన బుట్టిన శుక్లము స్రవించును. [2]మూత్రవస్థిలో [3]తాయివలెనున్న అశ్మరి యందురు. [4]పై చెప్పిన "అశ్మరి" చిన్నదైన యెడల యినుకవలె స్రవించును.

తచ్చికిత్స

శ్లో. సర్వకృచ్ఛ్రేషు సంశస్తం [5]వస్తికర్మ విరేచనమ్ ।
శర్కరా [6]సయవక్షా[7]రా సర్వకృచ్ఛ్ర[8]విభేదినీ ॥

సకలకృచ్ఛ్రలకు ఉత్తరవస్తి, [9]విరేచనము మంచివి. శర్క[10]ర యవక్షారము [11]వీటిని సేవి[12]ంచిన సకలకృచ్ఛ్రలు [13]నయమగును.

శ్లో. గోక్షురస్య ఫలం పిష్ట్వా పయసా సగుడం పిబేత్ ।

పల్లేరుగాయలను పాలుపోసి నూరి రసమును పిడిచి బెల్లము గలిపి సేవించిన సకల కృచ్ఛ్రలు [14]నయమగును.

శ్లో. మూత్రకృచ్ఛ్రేషు సర్వేషు శర్కరా వా విశేషతః ॥
పంచదారను సేవి[15]ంచిన సకలకృచ్ఛ్రలు [16]నయమగును.

నొప్పి మంట నెత్తురు గల కుచ్ఛ్రలకు
నారికేళాంబుప్రయోగము

శ్లో. యే నారికేళాంబు [17]నిశాం గుడం చ
పిబంతి [18]కుస్తుంబరుకల్కమిశ్రమ్ ॥
తే మూత్రకృచ్ఛ్రం సరుజం సదాహం
సరక్తమప్యాశు వినాశయ[20]న్తి ॥

---

1. తే
2. తే
3. దస్తినింబు
4. ట్టితే కల్లుపిరిగించును
5. శర్కరా వాశ్మలై తేను పగిలిసు
6. త్చ
7. నిరూపా
8. న
9. రం
10. భ్రాభ వేదినీ
11. వే
12. రాను
13. న్నూ
14. స్తేను
15. న్నూ మానును
16. న్నూమానును
17. స్తే
18. .మానును
19. గుడాంబునాశం
20. స్తీ

నారికేళపు నీ[1]ళ్లలో [2]ధనియాలు పసపు, నూరిన ముద్దను బెల్లము కలుపుకొని సేవించిన నొప్పి మంట నెత్తురుతో గూడిన మూత్రకృ చ్ఛ్రలు [3]శమించును.

## ఏలాదిచూర్ణము

శ్లో. ఏలాశ్మభేదకశిలాజితుపిప్పలీనాం
చూర్ణాని తండులజలై[4]ర్లులితాని పీత్వా ।
యద్వా గుడేన సహితా[5]న్యవలిహ్యా[6]నూన
మాసన్నమృత్యురపి జీవతి మూత్రకృచ్ఛ్రీం ॥

1. ఏలకులు 2. శిలాజిత్ 3. పిండివేళ్లు 4. పిప్పళ్ళు

[7]వీటిని చూర్ణముచేసి పస గడుగులో గలిపి గాని బెల్లముగలుపు కొని గాని సేవిం[8]చవలెను. [9]దీనివలన ఆసన్నమృత్యువు గలవాడై నను మూత్రకృచ్ఛ్రరోగి జీవించును.

## కతకాదికషాయము

శ్లో. జలప్రసాదాఖ్య సువర్చలాఖ్య
శతావరీగోక్షుర సిద్ధ[10]మంబు ।
పురాన్వితం [11]హంత్యనిలో[12]ల్బణాని
కృచ్ఛ్రాణి కృచ్ఛ్రాణ్యపి [13]సద్య ఏవ ॥

1, చిల్లగింజలు 2. ప్రొద్దుపొడుపువేళ్ళు 3. పిల్లితేగలు 4. పల్లేరువేళ్ళు,

---

1. కొతసురి
2. మానును
3. లుక
4. స్యపరి
5. మానా
6. ఇని
7 చేది
8. ఇందు నమృత్యుపశ్య మైన కృచ్ఛ్రలైనా మానును
9. ముఖ్యం
10. పాం
11. ల్వణీని
12. శుద్ధపే యేత్

ఇవి సమూాంశాలు. కషాయము బెట్టి మహిసాక్షి గుగ్గులును కలిపి [1]సేవించిన వాతకృచ్ఛ్రలు [2]నయమగును.

## కూష్మాండప్రయోగము

శ్లో, కూష్మాండవల్లీస్వరసం రసం వా
పిబంతి యే శర్కరయా విమిశ్రమ్ ।
తేషాం భవిష్యంతి భవాంతరే చ
న మూత్రకృచ్ఛ్రాణి విచిత్రమేతత్ ॥

గుమ్మడి తీగె కషాయమును కాని దానిరసమును గాని శర్కర కలుపుకొని సేవించిన మూత్రకృచ్ఛ్రలు [3]నయమగును.

## గోపాంగనాదికషాయము

శ్లో. గోపాంగ నాభీ[4]రు కశే[5]రువారి
విదారిగోకటంక సంభృతాంభః ॥
సశర్కరం తచ్ఛరణం నరాణాం
మూత్రవ్రణావగ్రహపీడితానామ్ ॥

1. సుగంధి వేళ్ళు 2, పిల్లిపీచర వేళ్ళు 3, నామదుంపలు 4. నేల గుమ్మడిగడ్డ 5. పల్లేరు వేళ్ళు

[6]వీటిని కషాయము బెట్టి ఈ కషాయములో నాలుగవ భాగము శర్కర గలిపి సేవి[7]ంచిన మూత్రకృచ్ఛ్రలు [8]నయమగుదు.

## పీసిశ్రిగు కషాయము

శ్లో. గోపగోశిగ్రుమూలో[9]త్థ కషా[11]యోఽశ్మరి పాతనః ।

---

1. స్తేను
2. మానును
3. మానును
4. తు
5. తు
6. చల్లగడ్డలు
7. యివి
8. స్తేను
9. షాను
10. ద్ద
11. యా

కారుమునగ వేళ్ళు కషాయము బెట్టి ఆ కషాయములో శొంఠి పిప్పలి గలిపి సేవిం[1]చిన [2]జాయి ఊడిపడును,

## సువర్చలాప్రయోగము

శ్లో, మూలం కపోతవంకాయా స్తక్రేణాశ్మరిపాతనమ్ ॥

ప్రొద్దుపొడుపు వేళ్ళను నూరి చల్లతో సేవించిన కల్లూడిపడును.

## శృంగబేరాదిచూర్ణము

శ్లో. శృంగబేరయవక్షారపథ్యాకాలేయకాన్వితః ।
దధిమండో భినత్త్యుగ్రశర్కరామశ్మరీమపి ॥

1. అల్లము, 2, యవక్షారము, 3. కరక్కాయ 4. పీత చందనము

ఇవి సమాంశలు చూర్ణము చేసి లేతపెరుగునఁ గలిపి సేవించిన ఉష్ణమువలనఁ బుట్టిన శర్కరాశ్మ[3]రి [4]నయమగును,

## కటుత్రయాదిలేపము

శ్లో, కటుత్రయపచాహింగుసింధుసర్షపమూలకైః ।
[5]అధోనాభేః ప్రలేపః స్యా[6]న్మూత్రవ్యాధివినాశనః ॥

1. త్రికటుకములు, 2, వస, 3. హింగువు, 4. సైంధవ లవణము, 5. ఆవాలు, 6. ముల్లంగివిత్తులు,

ఇవి సమాంశలు కలయ పోసి నూరి వెచ్చగా జేసి [7]పొత్తి కడుపున పూయవలెను. మూత్రకృచ్ఛ్రలు [8]నయమగును.

---

1. స్తేను
2. రా
3. రీమూత్ర
4. మదూనును
5. అయంమూప
6. న్మేఢ్ర
7. కాలు
8. కింగడుపునబూనేది

## మూత్రవిరేచనలేపము

శ్లో. [1]పిష్ట్వా శ్వదంష్ట్రాత్రిఫలమూషికావి-
[2]దుర్వారు[3]బీజాని సకాంజికాని ।
ఆ[4]లేప్యమానాని హి నాభివ[5]స్థాః
మూత్రస్య నిష్యందకరాణి సద్యః ॥

1. పల్లేరువిత్తులు, 2. ఎలుకపెంటికలు 3. దోసవిత్తులు

ఇవి సమాంశలు కలయ పోసి సూరి బొడ్డున[6]పట్టించి [7]పొత్తి గడుపున బట్టించిన ఆ క్షణముననే మూత్రము విడుచును.

శ్లో. మూత్రకృచ్ఛ్రేషు సర్వేషు [8]హితం వస్త్ర్యమయాంతకమ్ ।
తద్వత్త్రికంటకఘృతం చూర్ణం వా నారసింహకమ్ ॥

సకలకృచ్ఛ్రలకు వస్త్ర్యమయాంతకఘృతము [9]త్రికంటకఘృతము నారసింహచూర్ణము, ఇవి మంచివి.

# మే హ ని దా న ము

## శ్లేష్మమేహములు

శ్లో. ఉదకేక్షుసురా[10]పిష్టసికతాసాంద్రసంజ్ఞికాః ।
శనైశ్శీతల[11]శుక్లాహ్వా [12]లాలామేహాః క[13]ఫాత్మ[14]కాః ॥

1 ఉదకమేహము, 2 ఇక్షుమేహము, 3 సురామేహము, 4 పిష్టమేహము, 5 సికతామేహము, 6 సాంద్రమేహము 7 శనైర్మేహము, 8 శీతలమేహము, 9 శుక్లమేహము, 10 లాలామేహము

ఇవి శ్లేష్మసం[16]భవములు.

---

1. మానును
2. ది
3. చీమీన
4. వేప్య
5. సా
6. ంబెట్టి
7. కంగ
8. ంబెట్టి స్తే
9. మవ
10. తన్వత్రి
11. ది
12. తాంహ్వాః
13. నీలమేహాః
14. పా
15. క
16. ధానాలు

## పిత్తమేహములు

శ్లో. హారిద్రానీలమంజిష్ఠాక్షారరక్తాంజనాహ్వయాః ।
పిత్తజాః

1 హారిద్రమేహము, 2 నీలమేహము, 3 మంజిష్ఠమేహము
4 క్షారమేహము, 5 రక్తమేహము. 6 అంజనమేహము,

ఇవి పైత్యసం[1]భవములు.

## వాతమేహములు

వాతజాస్స[2]ర్పిర్మధు [3]మజ్జవసాహ్వా[4]యాః ॥

1 సర్పిర్మేహము 2 మధుమేహము, 3 మజ్జామేహము
4 వసామేహము ఇవి వాతసం[5]భవములు

## వాతాదిమేహమూత్రపరీక్షణవిధి

శ్లో. వాతపిత్తకఫమేహ[6]సంభవాత్
మూత్రతో౽గ్నిని[7]హితాత్ పరిపక్వాత్ ।
పంచ సప్త నవ భాగతః క్రమా-
త్కల్కముద్భవతి చాపి రసా[8]శ్యమ్ ॥

మేహ రోగికి మూత్రపరీక్ష[9]చేయువిధము. మూత్రమును కాచగ ఐదవ[10] భా[11]గమున కల్కము కట్టి[12]న వాతాధిక్యత కలదని యెఱుంగ[13]వలెను. [14]ఏడవ [15]భాగమున కల్కము కట్టి[16]న [17]పిత్తమధికముగ నున్నదని యెఱుంగవలెను. [18]తొమ్మిదవ [19]భాగమున కల్కము కట్టి[20]న శ్లేష్మ [21]మధికముగనున్నదని యెఱుంగవలెను.

---

1. హ
2. ర్వేమ
3. హస్తే
4. య
5. ధానాలు
6. హస్తిమేహములు
7. మొదలైనవి
8. బంధాలు
9. సమంధాఙ
10. జ్ఞిముఖతః
11. ధ్వద్
12. చూచేలాగు
13. గాను
14. దో
15. గా
16. తే
17. తసంధాన మని తెలిసేది
18. యేడో
19. గా
20. తేను
21. పైత్య సంబంధమని తెలిసేది
22. దో
23. కా
24. తేను
25. సంబంధమని తెలిసేది

## సాధ్యాసాధ్యములు

శ్లో. సాధ్యాః కఫో[1]త్థాః పిత్తోత్థా యాప్యా[2]స్త్యాజ్యాస్తు వాతజాః ।

శ్లేష్మమేహము సాధ్యము, పైత్యమేహము [3]యాప్యము వాత మేహము అసాధ్యము,

## తచ్చికిత్స

శ్లో. మేహార్తే సబ[4]లే శ [5]స్తం[6]వమనం సవిరేచనమ్ ।

మేహరోగి[7]బలము కలిగియున్నయెడల వాంతి విరేచన[8]ములను చేయించవచ్చును.

శ్లో. నిశాకల్కయుతో ధాత్రీస్వరసో మాక్షికాన్వితః ।
గుడూచీస్వరసో వాపి [9]సత్వం వా సర్వమేహజిత్ ॥

ఉసిరిక కాయల రసములో పసుపు నూరి కలిపి తేనెతో సే[10]వించిన [11]మేహములు నయమగును.

లేదా తిప్పతీగె రసమునుగాని, తిసత్తునుగాని తేనెతో [12]సేవించిన సర్వమే[13]హములు నయమగును.

శ్లో. సారముష్కకకింజల్కం కల్కమక్షమితం[14]చరేత్ ।
ధాత్రీరసే క్షౌద్రయుతే సర్వమేహహరం పరమ్ ॥

1. ఇప్ప చెక్క, 2. ముష్కకకింజల్కము,

[15]వీటిని సమాంశలుగా నూరిన కల్కము కర్షమెత్తు ఉసిరిక కాయల రసముతో తేనెను గలుపుకొని [17]సేవించిన సకల మేహములు నయమగును.

---

1. ధ్థాత్తోద్దా
2. త్యా
3. కష్టసాధ్యము
4. ల్యాచ
5. ను
6. సంచ
7. కిసత్యంగలిగినా
8. నాలకుయిచ్చేది
9. స్తేను
10. హిలుమానును
11. గొంటె
12. హాలుమానును
13. ష్కకకంలంటి
14. వందిచేత్
15. యివి
16. స్తే
17. హాలున్నామానును

శ్లో. [1]స్వర్ణపుష్ప్యాశ్చ పంచాగం ఛాయాశుష్కం చ కారయేత్ ।
తదర్ధామలకం చైవ తద[2]ర్ధం రజనీద్వయమ్ ॥
తక్రేణ మధునా వాపి సర్వమేహవి[3]నాశనమ్ ।

తంగేడు చెట్టుయొక్క పంచాంగ[4]ములను నీడను యెండించి చూర్ణముచేసి దీనికి సగముభాగము ఉసిరికపప్పు చూర్ణము, దీనికి సగముభాగము మానుబసపు మంచిపసుపుల చూర్ణముచేసి [5]పై పంచాంగ చూర్ణములో కలిపి తేనెతోగాని చల్లతోగాని సేవించిన సకల మేహములు [6]నయమగును.

శ్లో. అశ్వత్థబీజం హారిణస్య శృంగం
తక్రేణ పీతం మధునా [7]థ పీతమ్ ।
సర్వప్ర[8]మేహం సహ[9]సైవ హన్యా
ద్దశాననం దాశరథిర్యథైవ ॥

రావి విత్తు[10]లను [11]ఇఱికొమ్ము[12]లను నూరి కర్షమెత్తు, చల్లతోగాని తేనెతోగాని సేవించిన రఘునాథునిచేత రావణుండు [13]సంహారించబడినట్లు సహాలమేహములు హరించబడును.

శ్లో. త్రిఫలావేణుపత్రాబ్ద[14]పాఠాక్వాథః సమాక్షికః ।
కుంభయోనిరివాంభోధే దే[15]ర్మేహాణోనాం శోషద్ధ్రువమ్ ॥

1. త్రిఫలములు, 2. వెదురాకు,
3. ముస్తలు, 4. పాఠ వేళ్లు,

---

1. తలపొటక
2. ర్ధార
3. నశ్యేతి
4. మున్నూ
5. కూడాకలిపి
6. మాసును
7. చ
8. త్ర
9. సై
10. లున్నూ
11. యిఱి
12. లున్నూ
13. పోయినట్లు
14. హాలున్నూమానును
15. థిమేహా
16. యేద్ధ్వ

ఇవి సమాంశలు కషాయము బెట్టి తేనెతో సేవించిన అగస్త్యుని చేత సముద్రలింకినట్లు సకలమేహములు [1]శోషించబడును.

శ్లో. కతకఖదిరదా[2]ర్వీ[3]భూమిధాత్రీసమంగా
[4]విదులరజనిపాఠాచూతబీజాభయా[5]ద్యైః
ప్రసవరస[6]సమేతం తోయమేభిః ప్రసిద్ధం
హరతి సకలమేహాన్ సప్తరాత్రప్రయోగాత్ ॥

1, చిల్లగింజలు,
2. చంద్ర చెక్క,
3. మాను పసుపు,
4. నేలయుసిరిక వేళ్ళు,
5. మంజిష్టి,
6. నీరుపక్కి వేళ్ళు,
7. పసుపు,
8. పాఠ వేళ్ళు,
9. మామిడిగింజల పప్పు,
10. కరక్కాయలు,
11. ముస్తలు,

ఇవి సమాంశలు. కషాయము బెట్టి ఏడుదినములు తేనె కలుపుకొని [7]సేవించిన సకల[8]మేహములున్నూ [9]నయమగును.

శ్లో. తులాం ఖదిరసారస్య జలద్రోణే విపాచయేత్ ।
అష్టభాగావశేషం తు పూతం శీతం సమాహరేత్ ॥
హరీతక్యక్షధాత్రీణాం నిశాయాశ్చ పలం పలమ్ ।
సూక్ష్మచూర్ణం తతః కృత్వా క్వాథే[10]తస్మిన్విభావయేత్ ॥
బడబానలమిత్యుక్తం ప్రమేహా[11]ర్ణవశోషణమ్ ।

చంద్రచక్క నూరు పలములు, ద్రొక్కి ఒకద్రోణము నీళ్ళలో వేసి అష్టభాగావశేషముగ కాచి వడి[12]కట్టిన కషాయములో

---

1. హరింపబడును
2. ర్వీ
3. శాక
4. బిదుర
5. పనాథం
6. స్తే
7. హ
8. మానును
9. తేనకృత్వావి
10. ర్నవ
11. నల్లుముసీళ్ళుపోవి
12. చిన

1. కరక; 2. తాడి, 3. ఉసిరికలు, 4. పసుపు,

ఇవి ప్రత్యే[1]కము [2]పలము చొప్పున చూర్ణము చేసి కలిపి భావనచేసి ఆ చూర్ణమును దినమునకు [3]కర్ష మెత్తుచొప్పున సేవించిన మేహరోగమనే సముద్రమును బడబానలమువలె యింకించును.

శ్లో. చూతఫలత్రిఫల[4]ం సమభాగం

శైలమదం చ చతుర్గుణయుక్తమ్ ।

[5]లేహ్యమిదం మధునా చ విమి[6]శ్రం

వింశతిమేహమపోహతి [7]సద్యః ॥

1. మామిడివరుగు, 2. త్రిఫలములు,

ఇవి సమాంశలు చూర్ణము చేసి ఈ చూర్ణమునకు [8]చతుర్గుణముగ శిలాజితును కలిపి ది[9]నమునకు తులమెత్తు తేనెతో సేవించిన వింశతి మే[10]హములు [11]నయమగును.

## ఏలాదిచూర్ణము

శ్లో. ఏలశిలో[12]ద్భవమాక్షికమధుకమ్

వ్యోషయుతం చ ఫలత్రయయుక్తమ్ ।

సర్వసమం తలపోటకబీజమ్

చూర్ణం [13]వింశతిమేహ మపోహేత్ ॥

1. ఏలకులు 2. శిలాజతు 3. హేమమాక్షికము 4. యష్టిమధుకము 5. త్రికటు[14]కములు 6. వాయువిళం[15]గములు 7. త్రిఫలములు.

---

1. కాలు
2. దేసి
3. నెబెత్తునులేఖను
4. స్వచ
5. మే
6. శ్రే
7. సాధ్యః
8. నలుమడి
9. నా
10. హా
11. మానును
12. ద్ర
13. మిదం శతమేహా మపోహాత్
14. కా
15. గా
16. లా

ఇవి సమాంశలు. సర్వచూర్ణసమము తంగేడువిత్తులు.

వీటిని చూర్ణము చేసి ప్రతి దినము కర్షమెత్తు తేనెతో సేవించిన సకల మేహములు నయమగును.

## కాంతాభ్రక చూర్ణము

శ్లో. కాంతాభ్రమాండూరహరీతకీనాం
విచూర్ణితానాం క్రమశః [1]ప్రమాణమ్ ।
[2]ద్వయోస్తు భూతాంశమథో దశాంశం
[3]అష్టాంశచూర్ణం చ పృథక్ ప్రకుర్యాత్ ॥
తుల్యం సమ[4]స్తైస్తలపోటకస్య
చూర్ణం మృదిత్వా వ[5]టకాని ఖాదేత్ ।
తక్రేణ చైవం ప్రపి[6]బేత్ప్రభాతే
మేహామయో మేహవినాశనాయ ॥

1. కాంతము 5 భా[7]గములు 2. అభ్రక[8]ము 5 భాగములు 3. మాండూర[9]ము 10 భాగములు 4. కరక్కాయ చూర్ణ[10]ము 4 భాగములు [11]ఇన్నిటికి సరి తంగేడు చూర్ణము

వీటిని గలిపి త్రిఫలకషా[12]యముతో నూరి వటికలు చేసి ప్రతి దినము ఒక వటికను మజ్జిగతో సేవించిన మేహరో[15]గములు [16]నయమగును.

---

1. యివిసమాంశలుపుట్టి
2. కరాంశయ్
3. రసేన
4. ద్వాత్రింశమష్టాత్తమాయోః
5. స్తైత
6. టుకాన్యకుర్యాత్
7. దిశే
8. ౫
9. గా
10. ౦౫
11. ౦ ౧౦
12. ౦ ర
13. యింత
14. యాన
15. గా
16. మానను

## నింబాదిచూర్ణము

శ్లో. నింబాత్క[1]పిత్థాత్ఖదిరాత్ఫలాశాత్
[2]కృష్ణాచ్చ శుక్లాచ్చ తథాఽరిమే[3]దాత్
విడాఖ్యవృ[4]క్షాత్తలపోటకాచ్చ
గ్రాహ్యం తు ని[5]ర్యాసమథైకభాగమ్ ॥

శ్లో. స్యాద్భాగమేకం చ శిలాజితూ[6]త్థం
తాభ్యాం సమం స్యాత్తలపోటబీజమ్ ।
తక్రేణ చాలో[7]డ్య నిపీయమానం
మేహాం నిహింస్యాదపి మారుతో[8]త్థమ్ ॥

1. వేప, 2. వెలగ 3. చండ్ర 4. మోదుగ, 5. నల్ల తుమ్మ 6. [8]తెల్లతుమ్మ 7. తంగేడు

[9]ఈ చెట్లబంకలు సమాంశలు ఒకభాగము, శిలాజిత్తు ఒక భాగము, యీరెంటికి [10]సమభాగము తంగేడువిత్తులు,[11]వీటన్నిటిని చేర్చి చూర్ణముచేసి ప్రతిదినము కర్షమెత్తు చొప్పున చల్లతో సేవించిన వాయువుపల్ల పుట్టిన మే[12]హములుకూడ [13]నయమగును.

శ్లో. వస్త్ర్యామయాంతకం సర్పి[14]ర్వరం మేహహరం స్మృతమ్ ।
చూర్ణం చ నారసింహాఖ్యం లే[15]హశ్చా కు[17]లిజో మహాః ॥

వస్త్ర్యామయాంతకఘృతము, నారసింహ చూర్ణము, తంగేడు లేహ్యము యివి మేహహరములు.

---

1. శ్లో
2. త్థాన్
3. దాతి
4. హా
5. క్షస్త త్వ
6. ద్ధం
7. ద్రాః
8. వెణుతురు
9. యీ
10. న్నిసరి
11. అన్నికూడా
12. శా
13. మానును
14. వర
15. హా
16. శ్లో

## మేహపిడకానిదానము

శ్లో. పిటకా మర్మహృత్పృ[1]ష్ఠస్తనాం[2]శగుదమూ[3]ర్ధజాః ।
పర్వపాదకరస్థాశ్చ ఘ్నంతి సత్యం ప్రమేహినమ్ ॥

రోగికి మర్మ[4]స్థానములలోను, రొమ్మునను, వీపునను, స్తన[5]భాగములలోను, భు[6]జభాగములలోను, ఆసన[7]స్థానమునను, శిరస్సునను, కీళ్లభాగమునను, కాళ్లలోను, చేతులలోను పొక్కులు పుట్టిన ఇవి రోగిని చంపును.

శ్లో, అ[8]న్యాసు తాసు ప్రథమం జ[9]లూకాభిర్హ్రా[10]రేదసృక్ ।
పంచవల్కలకల్కేన లే[11]పయేదుపనాహయేత్ ॥

పై చెప్పిన మేహపిటకలుగాకను, పై స్థానములు గాకను యుండిన యెడల జలగచేత నెత్తురును దీయించి పంచవ[12]ల్కలములను నూరి పట్టిం[13]చి క[14]ట్టవలెను.

శ్లో. పక్వం విపాట్య మతిమాన్ వ్రణవత్సముపాచరేత్ ।

ఆవ్ర[15]ణములు ప[16]క్వమునకు వ[17]చ్చినయెడల [18]ఛేదించి వ్రణచికిత్స[19]ను చేయవలెను.

## వృద్ధినిదానము

శ్లో, వృద్ధిస్సప్తవిధో జ్ఞే[20]యః ఫలకోశవిదూషణాత్ ।
అంత్రజః శ్వాసశూలాభ్యాం వస్త్యాధ్మానాన్నసిధ్యతి ॥

---

1. ష్ట
2. స
3. ర్ధగాగా
4. స్థానాలు
5. నాల
6. జాల
7. నా
8. తేసు
9. స్త్రౌ
10. ల్యా
11. స్మ్రైక్
12. హ
13. ల్కాలును
14. చేది
15. ట్టేది
16. ణా
17. క్వా
18. చ్చినా
19. చించి
20. చేసేది
21. యా

అపానవాయువు ప్రకోపించి [1]ఏడు [2]విధములైన వృద్ధిరోగము లను పుట్టించును. అపానవాయువు పేగులలో వ్యాపిం[3]చినయెడల [4]హాత్తి గడుపు కడుపు ఉబ్బి, శ్వాసశూలలు కలిగి[5]న యెడల చంపును,

శ్లో. సప్తవృద్ధిషు కర్తవ్యం కరంజార్క–పునర్నవైః ।
శ్లక్ష్ణపిష్టైః ప్రదాతవ్యం లేపనం చోపనాహనమ్ ॥
సప్తవృద్ధులకు కానుగాకు, జిల్లేడాకు, గలిజేరుఆకు,
[6]వీటిని నూరి పట్టించి క[7]ట్టవలెను,

శ్లో. నిత్యమేరండకోరండనిర్గుండీభిః కృతం జలమ్ ।
సైంధ[8]వైరండతైలాఢ్యం సప్తవృద్ధిషు పాయయేత్ ॥

1. చిట్టాముదపువేళ్ళు 2. ములుగోరింటవేళ్ళు 3. వావిలి వేళ్ళు,

ఇవి సమాంశలు కషాయము బెట్టి అందులో సైంధవలవణము ఆముదము కలిపి [9]సేవించిన సప్తవృద్ధులు [10]నయమగును.

శ్లో. సరామ[11]ఠం కుబేరాక్షీకుళు[12]త్థలశునైః శృతమ్ ।
సలిలం ఘృతసంయుక్తం సప్తవృద్ధిషు పా[13]యయేత్ ॥

1. గచ్చవేళ్ళు 2. ఉలవలు 3. వెల్లుల్లి

ఇవి సమాంశలు. కషాయము బెట్టి అందులో ఇంగువ, నెయ్యి గలుపుకొని సేవించిన సప్తవృద్ధులు [16]నయమగును,

---

1. యే
2. భేధాలయినసప్తవృద్ధులు
3. చోనా
4. కం
5. బ్బును
6. నా
7. పుటుందరజితాభిర్వా
8. యివి
9. ట్టేది
10. కే
11. కసేవిస్తే
12. న్నూ మానును
13. థ
14. ద్ధ
15. జ
16. న్నూమానును

శ్లో. ఇంద్రవల్లీప్రసారణ్యోః క్వాథః స్యాత్స_ప్తవృద్ధిజిత్ ।
పావరసమూలము *సవరలస మూలము

ఇవి సమాంశలు కషాయముబెట్టి సేవించిన స_ప్తవృద్ధులు [1]నయమగును,

శ్లో. మాహిషస్య శకృచ్చూర్ణం శర్కరామధుసంయుతమ్ ।
పిబేద్గుళూ[2]చీక్వాథేన స_ప్తవృద్ధషు శాంతయే ॥

[3]గేదెపేడను చూర్ణము చేసి తిప్పతీగెకషాయములో యీ చూర్ణము[4]ను శర్క[5]రను, తేనె గలిపి సేవించిన స_ప్తవృద్ధులు [6]నయమగును.

శ్లో. మోరటమూలకషాయవిమిశ్రం
హింగుమహౌషధసైంధవకృష్ణాః ।
చూర్ణమిదం ప్ర[7]పిబేచ్ఛ దినాదౌ
స_ప్తకవృద్ధిమపోహతి సద్యః ॥

చాగవేళ్ళ కషాయములో [8]ఇంగువ శొంఠి, సైంధవలవణము, పిప్పళ్లు వీటిని సమముగా చూర్ణముచేసి కలిపి సేవించిన స_ప్తవృద్ధులు [9]నయమగును.

శ్లో. సౌవర్చికాసైంధవహింగుజీర-
కరంజయుగ్మశ్రవణాఖ్యభేషజైః ।
కటుత్రికై[10]శ్చూర్ణ[11]యుతః కషాయః
కరోతి ము[12]ష్కం కరివృష[14]ణసన్నిభమ్ ॥

---

1. మానును
2. చిపాదే
3. ఎనుప
4. నూ
5. రాను
6. నూ మానును
7. సచేత్స
8. హింగువ
9. నూమానును
10. ణంహ్యా
11. చూ
12. కృ
13. ష్ణం
14. ఛ

*సవరల = సర్పాక్షి

1. సౌవర్చలవణము, 2. సైంధవలవణము, 3. ఇంగువ 4. జీలకఱ్ఱ, 5. కానుగచెక్క, 6. నెమలుజక్క, 7. బోడతరము 8. శొంఠి, 9. పిప్పలి, 10. మిరియాలు,

ఇవి సమాంశలు చూర్ణముచేసి కషాయముపెట్టి సేవించిన వృషణములు యేనుగువృషణములవలెనగును,

చించిల్యాదితైలము

శ్లో, జటిలాశిగ్రుముండీభిః చించాపత్రరసాఢకే ।
తైలప్రస్థం పచే[1]ల్లేపా [2]త్స_ప్తవృద్ధిమపోహతి ॥
చింతాకు రసము [3]ఒక ఆఢకము, నూనె[4]ఒక ప్రస్థము.

[5]జటామాంసి, మునగవేఱుచెక్క, బోడతరము, ఈ మూడు [6]సామానులను నూనెకు ఎనిమిదవ భాగము[7]గకూర్చి కల్కముగ బెట్టి కాచిన తైలమును బట్టిం[8]చిన స_ప్తవృద్ధులు నయమగును.

మూత్రవృద్ధిని [9]ఛేదించవలెను. అంత్రవృద్ధికి రక్షలు[10]వేయవలెను.

శ్లో. పి_త్తరక్తో[11]ద్భవాయాం తు జలూకాభి_ర్హ రేదస్రుక్ ।

పైత్యర[12]_క్తముల వలన బుట్టిన వృద్ధి[13]రోగమున జలగచేత నెత్తురు తీ[19]యవలెను,

---

1. ద్ర
2. కర్ష మెత్తుచూర్ణము వేడి నీళ్ళతో
3. ల్లే
4. స
5. వాలుగుకుంచాలు
6. కుంచెడు
7. పసుపు
8. దోయాలున్నూ
9. ము
10. ంగా
11. స్తే
12. న్నూనూనును
13. చించేది
14. చేసేది
15. భయా
16. స్త్రుక్
17. క్తా
18. కి
19. చేది

# ఉపదంశ చికిత్స

శ్లో. ఉపదంశో [1]ధ్వజే శో[2]పః [3]స తు పంచవిధః [4]స్మృతః ।

ప్రజాపతిమీద [5]ఐదు [6]విధములైన ఉపదంశలు బుట్టును.

శ్లో. స్త[7]బ్ధమేఢ్రో౽తిరుగ్వాతాత్ పిత్తాత్తామ్రో౽తిదాహవాన్ ।
క[8]ఫాత్కాఠిన్యకండూమాన్ రక్తజః పిత్తలక్షణః ॥
సర్వలిం[9]గ స్త్రిదో[10]షోత్థః [11]స తు లింగవినాశనః ।

వాతోపదంశమున ప్రజాపతి [12]స్తబ్ధమై యుండును. నొప్పిగలిగి యుండును.

పిత్తోపదంశ [13]మున ఎఱ్ఱనై మంట గలిగి [14]యుండును.

శ్లేష్మోపదంశమున కఠినమై [15]దురద గలిగి యుండును.

నెత్తురువలన బు[16]ట్టినయెడల ఎఱ్ఱనై మంటగలిగి యుండును.

త్రిదోషమువలన[17]పుట్టినయెడల ప్రజాపతి [18]సర్వాలింగములు కలిగి కుళ్ళిపోవును.

శ్లో. స్నిగ్ధస్విన్నస్య తేష్వాదౌ ధ్వజ[19]మధ్యే[20]శిరా[21]వ్యధమ్ ।
జలూకాపాతనం వాపి కుర్యాదథ విరేచనమ్ ॥

ఉపదంశరోగికి సర్వాం[22]గములకు చమురు పట్టించి కాపిం[23]చవలెను, ప్రజాపతి[32]పైభాగ[33]మధ్యభాగమున శిరవిడిచి నెత్తురు [34]తీయవలెను

---

1. ర్వ
2. భా
3. సవ
4. కృతః
5. అ
6. భేధాలుతోను
7. బ్జ
8. షా
9. గోత్రి
10. ధ
11. న
12. మానుపడును
13. యద్రై
14. వు
15. మాల
16. ట్టైనా
18. వుణ్ణైనా
19. చెడును
20. ధస్వే
21. వంధ్యే
22. శరాం
23. వదేత్
24. యి
25. చమిరితే
26. శంమానును
27. పాఖ్యా
28. ప్రకో
29. ంపక్వానకువచ్చునా
30. ంగానా
31. చేది
32. మీద
33. నడుమను
34. సేది

లేదా జలగలచేత నై[1]నను నెత్తురు[2]దీయించవలెను. [3]తరువాతవిరేచన సాధన చేయవలెను.

శ్లో. మధూకకాష్ఠ[4]ం సంఘృష్య లేపయేచ్ఛో[5]ఫశాంతయే ।
రసాంజనం శిరీషం [6]చ పథ్యాయ[7]వసమన్వితమ్ ॥
సక్షౌద్రం లేపనం యోజ్యం సర్వాసంగగదాపహమ్ ।

ఉపదం[8]శమునకు ఇప్పచేవతో గంధము తీసి [9]పట్టించిన [10]ఉపదంశము [11]నయమగును.

1. రసాంజనము, 2. దిరిశనపు చెక్క,
3. కరక్కాయ, 4. యవలు,

వీటిని తేనెపోసి నూరి [12]పట్టించిన ఉపదంశము [13]నయమగును.

శ్లో. పక్వము[14]త్పాట్య మతిమాన్ [15]వ్రణవత్సముపాచరేత్ ।

ఉపదంశ[16]ము పక్వమునకు వచ్చినయెడల [17]ఛేదించి వ్రణ చికిత్స [18]చేయవలెను.

## శ్వాసనిదానము

శ్లో. శ్వాసః పంచవిధ స్తత్ర మహాశ్వాసో మహాస్వనః ।
ఊ[19]ర్ధ్వాఖ్యేతూర్ధ్వదృష్టః [20]స్యాద్విచ్ఛిన్నా [21]చ్ఛిన్నసౌజ్ఞకమ్ ॥
పమో బ[22]లీ ఘునాలోకే క్షుద్రాఖ్యే మందవేదనా ।
క్షుద్రః సాధ్య స్త[23]మో యాప్యః శే[24]షాః ప్రాణా[25]పహారిణః ॥

---

1. నా
2. సేద
3. ఆ వెనుకవిరేచనాని కిచ్చేది
4. నం
5. భ
6. నా
7. ధ
8. శా
9. చమిరేరి
10. వాతో
11. ంమానును
12. చించి
13. లసినది
14. ర్ధ్వశ్వాసో
15. శ్వావిభిన్నా
16. భి
17. తీ
18. మా
19. ష
20. వహాత్త్రయః

శ్వాసరో[1]గములు ఐదు విధములు. మహాశ్వాస పెద్దధ్వని [2]కలిగియుండును. ఊర్ధ్వశ్వా[3]సమున ఊర్ధ్వ దృష్టి [4]కలిగియుండును. చిన్నశ్వాస నిలిచి నిలిచి [5]పుట్టును. [6]తమకశ్వాసము వర్షఋతువున బలము కలిగి యుండును. క్షుద్రశ్వా[7]సమున అల్పపు నొప్పి గలిగి యుండును.

క్షుద్రశ్వాస సాధ్యము. తమకశ్వాస కష్టసాధ్యము, కడమ మూడు శ్వాసలు అసాధ్యములు.

శ్లో. శ్వాసరోగిణి తై[8]లాక్తే స్వేదః కార్యో ముహుర్ముహుః ।
ఊర్ధ్వే[8]గే [9]శోధనం శక్తే దుర్బలే శమనౌషధమ్ ॥

శ్వాశరోగికి దే[10]హమున తైలము పట్టించి స్నేహపొట్ల[11]ములతో [12]స్వేద చికిత్స చేయవలెను. [13]రోగి బలవంతుడైనయెడల [14]విరేచన ప్రయోగము చేయవలెను. [15]రోగి బలహీనుడైనయెడల శమనౌషధము నీయవలెను.

శ్లో. గుడోషణశిలాలాక్షా రాస్నామాగధికాస్సమాః ।
తైలేన చూర్ణి[18]తా [19]లీఢా స్త్రీవశ్వాసను[20]దస్సృతః ॥

1. మిరియాలు, 2. మణిశిల,
2. రాస్న, 4. లక్క,
5. పిప్పళ్ళు,

---

1. గాలు అయిదుబేగాలు శ్వాస
2. సానవుదాడ్డ మోతగలిగి యుండును
3. సానవు
4. అయి
5. పుట్టేది
7. కన్నులుకానరాక
6. భ్రమశినట్లుండునుతమ
7. సానవు
8. లోక్త
9. న
10. శ్వాధనశ్శక్తః
11 హా
12. ట్లాల
13. గాచేది
14. సత్వంకనిగెసా
15. సత్వబారనిచ్చేది
16. సత్వంలేమండెనా
17. ంయిచ్చేది
18. తా
19. తీధా
20. దస్సృతః

[1]ఇవి సమాంశలు, చూర్ణముచేసి [2]సమాంశము బెల్లము గలిపి నూనెతో సే[3]వించిన తీవ్రశ్వాస[4]లు నయమగును.

శ్లో. ఉశీరం చ శిరీషం చ పిప్పలీగుడసంయుతమ్ ।
పిష్ట్వా తండులతోయేన పీత్వా శ్వాసమపోహతి ॥

వట్టివేళ్ళు, దిరిసెపుచక్క, పిప్పళ్లు,

ఇవిసమాంశలు. పసగడుగుతో నూరి బెల్లము గలుపుకొని సేవించిన శ్వాస నయమగును.

శ్లో. వసుధా[5]గృహధూమం [6]సహింగుతైలం విమిశ్రితమ్ ।
[7]బింబీరసేన [8]పక్తవ్యం శ్వాసమాశు నియచ్ఛతి ॥

దొండాకు రసము నాలుగు [9]భాగములు, నూనె ఒక భాగము.

1. బ్రహ్మజముడు చెక్క, 2. కరుధూపము, 3. ఇంగువ,

వీటిని తైలమునకు [10]ఎనిమిదవ [11]భాగము కల్క[12]ముగ బెట్టి కాచిన తైలమును లోనికి [13]పుచ్చుకొనిన శ్వాసలు [14]నయమగును,

శ్లో. శ్వాసకాసే వృషఘృతం జ్వరోక్తం [15]పరమౌషధమ్ ॥

శ్వాసకాసలకు జ్వరచికిత్స[16]లో జెప్పిన వృషఘృతము మంచిది.

శ్లో. దేవదారునిశారాస్నాత్రిఫలావ్యోమపద్మకైః ।
సవిళం[17]గైః సితా తుల్యా తచ్చూర్ణం శ్వాసకాసజిత్ ॥

1. సరళ దేవదారువు, 2. పసుపు, 3. రాస్న, 4. త్రిఫలములు, 5. త్రికటుక[21]ములు, 6. పద్మపువేళ్లు, 7. వాయువిళంగములు,

---

1. యి
2. సరిగా
3. స్తే
4. మానును
5. ధాత్ర
6. చ
7. జంబీ
8. త
9. గా
10. యి
11. దో
12. ము
13. ంగా
14. గొన్నను
15. మానును
16. ఫ
17. పట్టున
18. స్థ
19. లా
20. కా
21. గా

ఇవి సమాంశలు చూర్ణముచేసి [1]దీనికి సమభాగము శర్కర గలిపి ప్రతిదినము కర్షమెత్తుచొప్పున సేవించిన శ్వాసకాసలు [2]నయమగును.

శ్లో. దురాలభా కణా ద్రాక్షా శృంగీ పథ్యా[3]విచూర్ణి[4]తాః ।
మధు[5]సర్పిర్యుతో[6] లేహః శ్వాసకాసోర్ధ్వవాతజిత్ ॥

1. దూలగొండివేళ్లు, 2. పిప్పళ్లు, 3. ద్రాక్షపండ్లు 4. కర్కాటశృంగి, 5. కరక్కాయ,

ఇవి సమాంశలు చూర్ణముచేసి తేనె నెయ్యి కలిపి కర్షమెత్తు [6]చొప్పున సేవించిన శ్వాస, కాస, ఊర్ధ్వశ్వాస, మొద[7]లగునవి శమించును.

శ్లో. శ[8]ఠీసింధూద్భవవ్యోషవిళంగామయ హింగుభిః ।
లేహః [9]సాజ్యమధుః శ్వాసకాసహిక్కా[10]సు పూజితః ॥

1. కచ్చూ[11]రములు, 2. సైంధవలవణము, 3. శొంఠి, 4. పిప్పళ్లు, 5. మిరియాలు, 6. వాయువిళం[12]గములు, 7. చెంగల్వకోష్టువు, 8. ఇంగువ,

ఇవి సమాంశలు చూర్ణముచేసి తేనె, నెయ్యి, కలుపుకొని కర్షమెత్తు [13]చొప్పున ప్రతిదినము సేవించిన శ్వాస, కాస, హిక్కలు [14]నయమగును.

శ్లో. హిక్కా-శ్వాసీ [15]పిబేద్భార్గీం సవిశ్వాముష్ణవారిణా ।
[16]నాగరం వా [17]సితాభా[20]ర్గీ సౌవర్చలసమన్వితమ్ ॥

---

1. సరిగా
2. మానును
3. వ
4. త
5. స్స
6. లేఖను
7. యినబిమానును
8. ఠి
9. సాజ్యమయం
10. రు
11. రా
12. గా
13. హింగువు
14. లేఖను
15. మానును
16. విశే
17. క్షీణ
18. సా
19. ని
20. క్షీణ

1. భారంగి, 2. శొంఠి,

సమాంశలు చూర్ణముచేసి కర్షమెత్తు చొప్పున వేడినీళ్లతో [1]పుచ్చుకొనవలెను.

లేదా శొంఠి, భారంగి, సౌవర్చలవణము,

[2]ఇవి సమాంశలు చూర్ణముచేసి శర్కరగలిపి వేడినీళ్లలో [3]కర్షమెత్తు చొప్పున సేవించిన హిక్కాశ్వాసలు [4]నయమగును.

శ్లో. దగ్ధం ద[5]ద్యాన్మ[6]యూరస్య నాళమాజ్యమధూత్కటమ్ ।
శలలం శల్యకోత్థం వా శ్వాసహిక్కావపీడితే[7] ॥

మయూరనాళమును క్షారముచేసి, నేయి, తేనె కలిపి యిచ్చిన శ్వాసకాసలు నయమగును.

ఏదుపంది ముల్లును భస్మముచేసి నెయ్యి, తేనె కలిపి యిచ్చిన శ్వాసలు నయమగును,

## కాసనిదానము

శ్లో. కాసః పంచవిధస్తత్ర శుష్కో వాతాత్మ[9]కో మతః ।
పైత్యతో దాహసంయుక్తః శ్లేష్మతః పీనసాన్వితః ॥
క్షతోర[10]సః స్యాత్ క్షతజః క్షయజస్తు క్షయాకృతిః ॥
యా[11]ప్యః క్షతః సముద్భూతః క్షయకాసో న సిధ్యతి ॥

కాసరోగ[12]ములు ఐదు [13]విధములు.

వాతకా[15]సమున పొడి దగ్గుకలిగి యుండును.

---

1. గానేది
2. పరిగా
3. వేడెత్తులెఖను
4. మానును
5. ధ్యా
6. మారాస్యం
7. దయ్
8. ఉత్తరేణునడిమికాడలు గాల్చినభస్మంతేనెనె య్యికలిపియిచ్చేది
9. వేదామంగవేరుతునకలు కాల్చినభస్మంతేనెనె య్యికలిపియిస్తేహిక్క శ్వాసలుమానును
10. గా
11. ర
12. త్య
13. గా
14. బేధాలు
15. సరు

పైత్యకా[1]సమున దాహము కలిగియుండును.

శ్లేష్మకా[2]సమున పీనస కలిగి యుండును.

అభిఘాతము వలన [3]ఉరఃక్షతము కలిగి [4]క్షతకాస పుట్టును.

క్షయకాస క్షయ[5]లక్షణములతో గూడియుండును.

క్షతకాస యాప్యము. క్షయకాస [6]అసాధ్యము.

తత్సచికిత్స

శ్లో. కాసమర్దామృతాక్షుద్రావృషభృంగరసైః శృతమ్ ।
పంచ[7]కల్కశృతం సర్పిః పంచకాసవినాశనమ్ ॥

1. కసివింద, 2. తిప్పతీగె, 3. వాకుడు, 4. అడ్డసరము, 5. గుంటకలగర,

ఈ [8]ఐదింటిని త్రొక్కి తీసిన రస[9]ము 4. భాగములు. నెయ్యి ఒకభాగము. నేతికి యెనిమి[10]దవ భాగ[11]ముగ యీ [12]ఐదు చెట్లవే[13]ళ్లను కల్కముగా బెట్టి కాచిన ఘృత[14]మును సేవి[15]ంచిన పంచకాసలు [16]నయమగును.

శ్లో, స్నిగ్ధస్విన్నం వామయిత్వా కాసినం రేచయేత్తతః ।

కాసరోగి దే[17]హమునకు తైలమును పట్టించి స్నేహ[18]పాట్లములతో స్వేదచికిత్సను చేయవలెను. ఆ వెనుక వాంతి వి[21]రేచన [22]సాధనములను చేయవలెను.

---

1. సకు
2. సకు
3. దుమ్మున
4. నుండిరక్త
5. ము
6. మానును
7. స్తృతమ్
8. త సవిధం
9. అయిదు
10. ం శభాగాలు
11. దో
12. ం
13. అయి
14. ళ్లనూ
15. ం
16. స్తే
17. న్నా మానును
18. స్వేహాశ్విన్నంవామయిత్వా గాశీసంరేచయేత్తతః
19. హానచమురు
20. ట్లాలనుకాచేది
21. రా
22. ములకిచ్చేది

శ్లో. భార్గీనిరిగ్ధికాక్వాథం పిప్పలీమధుసంయుతమ్ ।
[1]పిబేత్ పంచవిధం కాసం శ్వాసమాశు నియచ్ఛతి ॥

1. భారంగి, 2. వాకుడువేళ్లు.

సమాంశలు కషాయముబెట్టి తేనె, పిప్పలి, గలిపి సేవించిన పంచకాసలు శ్వాసలు, [2]నయమగును.

శ్లో. భజేచ్ఛ్వాసో[3]దితం కాసీ [4]శ్వాసీ కాసోదితం భ[5]జేత్ ॥

శ్వాసచికిత్సనే కాస[6]రోగికిని కాసచికిత్సనే శ్వాస [7]రోగికిని ఈయ వచ్చును.

## భార్గ్యభయాది లేహ్యము

శ్లో. ద్విపంచమూలీతులయా సమేతం
శతం ప్రకల్ప్య ద్విజయష్టికాయాః ।
హరీతకీనాం చ శతం [8]ప్రకల్ప్య
ద్రోణద్వయే[9]న ప్రపచేద్ధుతాశే ॥

శ్లో. క్వాథే పదస్థే తు హరీతకీభిః
[10]తథా సమేతం తులయా గుడస్య ।
పక్త్వా[11]ఽవలే[12]హే శిశిరే చ తస్మిన్
క్షౌద్రం క్షిపేదష్ట[16]పలప్రమాణమ్ ॥

---

1. భార్గ్యాభయాదిలేహం
2. ర్గీణ
3. పీతం
4. మానును
5. ద్ధి
6. కాసశ్వా
7. జే
8. కాను
9. కాను
10. చజ
11. ణ
12. క్వాథేపద స్థేతకీస్థా
13. కిమేత స్తుల స్త్రి వ్నన్షః
14. ఫ
15. వః
16. ఫ

పలత్రయం చ త్రికటోశ్చ చూర్ణం
[1]పలం చతుర్జాతకభేషజానామ్ ।
ఇత్యాశ్వి[2]నం భార్జ్యభయాదిలేహ్యం
ప్రయుక్తమా[3]త్రే తు భిషగ్వరేణ ॥

శ్లో. శ్వాసం జయేత్పంచవిధం చ కాసం
శోష[4]ం తథైకాదశరూపముగ్రమ్ ।
హిక్కాకఫశ్ఛర్దిమురోవికార-
[5]మరోచకం మేహమపస్మృతిం చ ॥

1. మారేడువేళ్లు, 2. గుమ్మడివేళ్లు, 3. తెక్కలివేళ్లు
4. కలిగోట్టువేళ్లు, 5. పంపెనవేళ్లు, 6. కోమలిపొన్న వేళ్ళు,
7. ముయ్యాకుపొన్న వేళ్లు, 8. ములకవేళ్ళు, 9. వాకుడువేళ్లు,
10, పల్లేరువేళ్ళు

[6]ఈ పదిసామానులు 100 [7]పలములు, భారంగి 100 పలములు,
కరక్కాయలు 100 పలములు,

[8]వీటన్నిటిని [9]రెండుద్రోణముల నీళ్లలో వేసి నాలు[10]గవభాగము
మిగులునట్లుగ చిక్కకాచి ఆ కషాయములో 100 పలములు బెల్లము
కలిపి వ[11]డికట్టి ఆ కషాయములో ఆ కరక్కాయ[12]లకు రం[13]ధ్రములు
[16]పొడిచివేసి లేహ్యపాకముగా కాచి ఆ లేహ్యములో

---

1. ఫ
2. ఫ
3. నా
4. ర్జక్ష్యై
5. త్రో
6. స్తథై
7. ఆ
8. యీ పది దో యా నున్నూ
9. ఫలా
10. యిన్ని నీ
11. ఎనమందుం నీళ్లు
12, గోభాగం
13, దడపెట్టి
14. లు
15. ధ్రా
16. పుచ్చి

1. శొంఠి [1]ఒకపలము, 2. పిప్పళ్ళు [2]ఒకపలము, 3. మిరియాలు [3]ఒకపలము, 4. ఏలకులు, ఒక[4]పలము, 5. లవంగపుచెక్క [5]ఒకపలము, 6. ఆకుపత్రికము [6]ఒకపలము, 6. నాగకేస[7]రములు [8]ఒకపలము,

[9]వీటిని చూర్ణము చేసి కలిపి చల్లా[10]రిన తరువాత తేనె [11]ఎనిమిది ఫ[12]లములు గలపవలెను.

ఈ భార్ఙ్యభయాదిలేహ్యమును సేవించిన [13]ఐదు కాసలు [14]పదకొండు ఉపద్ర[15]వములతో గూడిన క్షయలు, వెక్కులు, శ్లేష్మఛ్ఛర్ది, హృద్రోగము, అరుచి మే[10]హములు అపస్మారము ఉపద్రవసహి[17]తములయిన [18]ఇవన్నియు నయమగును,

ఇది అశ్వినీదేవతల ప్రయోగము.

# హిక్కానిదానము

శ్లో. యమళా యమళై ర్వేగైః మహతీ సుమహాధ్వనిః ।
గంభీరా నాభిసంభూతా క్షుద్రాఖ్యా మందవేదనా ॥
అ[19]న్నజాఽపి తథైవ స్యా[20]త్పూర్వాస్త్రిస్రో వివర్జయేత్ ।

రెండేసి వేగములతో కూడి వ[21]చ్చునది యమళహిక్క. మహాధ్వనితోగూడి వచ్చునది మహాహిక్క. నాభినుండి పు[22]ట్టునది గంభీరహిక్క. మెల్లని నొప్పితోగూడినది క్షుద్రహిక్క. భోజనము వలన పు[23]ట్టునది అ[24]న్నజహిక్క. [25]ఇట్లు [26]ఐదు [27]విధములు హిక్కలు.

---

1. ఫ ం
2. ఫ ం
3. ఫ ం
4. ఫ ం
5. ఫ ం
6. ఫ ం
7. రా
8. ఫ ం
9. యిన్నిన్నీ
10. ర్చగాను
11. నయె
12. లా
13. జ్వర
14. అయి
15. ంం
16. వా
17. హో
18. తా
19. యిన్నిన్నీ మానును
20. మహాత్తా
21. ఖో
22. న
23. పూ
24. చ్చే
25. టి
26. టి
27. నజా
28. ఇవి
29. ఆయిదు
30. భేదా

క్షుద్రహిక్క అ[1]న్నజహిక్కలు సాధ్యములు. కడమ మూడు [2]అసా[3]ధ్యములు.

తచ్చికిత్స

శ్లో. శ్వాసకాసోదితం సర్వం తథా హిక్కావహం స్మృతమ్ ॥

శ్వాసకాసరోగ చికిత్సనే హిక్కారో[4]గమునకు [5]చేయవచ్చును.

శ్లో. క్షారచూ[6]ర్ణరసాకీర్ణం హిక్కా[7]ఘ్నం సర్పిరుత్తమమ్ ॥

టీ. నేతిలో యవక్షారమును గలిపి సేవించిన హిక్కలు నయమగును.

శ్లో. నాగరం గుడసంయుక్తం పిప్పలీ శర్కరాన్వి[8]తా ।
నావ[9]నద్వితయం హి[10]క్కానాశనం నాద్భుతం వ[11]చః ॥

శొంఠి బెల్లము గాని లేదా పిప్పలి పంచదారలను గాని వేడి నీళ్ళలో గలిపి నస్యముచే[12]సిన హిక్కలు [13]నయమగును.

శ్లో. తూవరీదళమూలస్య క్వా[14]థం వా దేవదారు[15]ణః ।
మది[16]రాం వారి [17]వా హిక్కాకాసశ్వాసని [18]కృత్తయే ॥

దశమూ[19]లములు కందులు కలిపి కషాయము బెట్టి యిచ్చునది. లేదా సరళదేవదారు కషాయ[20]ము బెట్టి యి[21]చ్చునది. లేదా మద్య[22]ము నైనను యి[23]చ్చునది,

హిక్కారోగము [25]నయమగును.

---

1. నజా
2. ధ్యా
3. ధ్యా
4. గా
5. నే
6. ర్ణంరసం
7. ఘ్నం
8. మానును
9. త
10, నా
11. క్క
12. చం
10. స్తే
12. నానును
13. థ
14. ణం
15. కాం
16. థే
17. కృంతయేత్
18. లా
19. న్మా
20. చ్చే
21, ం
22. చ్చే
23. మయినా
24. చ్చే
25. మాను

శ్వాసరోగము [1]నయమగును.

శ్లో. [2]లాజసక్తుసమా[3]క్తం [4]కపిత్థఫలమజ్జయా ।
మధునా హంతి సం[5]లీఢం హి[6]క్కాం ఛర్దిమరోచ[7]కమ్ ॥

లాజసత్తు వెలగపండు గుంజు [8]వీటిని తేనెతో సేవించిన హిక్క ఛర్ది అరోచ[9]కములు [10]నయమగును.

## ఛర్దినిదానము

శ్లో. [11]పృథక్ దోషైశ్చ సక[12]లైః భతాంబ్సీ[13]లోకనేన చ ।
[14]ఛర్దయః పంచధా [15]తత్ర [16]సర్వైః సోపద్రవాం త్యజేత్ ॥

ప్రత్యేక వాతపిత్తశ్లే[17]ష్మముల వల్లను, త్రిదోషముల వల్లను, [18]అసహ్యాకరమైన వస్తువులను చూచినందువల్లను, ఐదు విధములైన ఛర్దులు పుట్టును.

శ్లో. అన్యా[19]సు లంఘయేత్పూర్వం ముహుః కార్యం విరేచనమ్ ।

ఈ చెప్పినవి గాక యితరమైన [20]ఛర్దులకు అనగా అజీర్ణ[21]ఛర్దులకు తరుచుగా లంఘనము పె[22]ట్టునది. విరేచనములకు ని[23]చ్చునది.

శ్లో. వాసాపుష్పోద్భవం వారి గుళూ[24]చీకాండజం జలమ్ ।
కృష్ణా [25]లాజాః కోలమజ్జా కపిత్థామ్లత్రిజాతకమ్ ॥
సక్షౌ[26]ద్రాః పా[27]దికా యోగాః సర్వ[28]చ్ఛర్దినిబ్హ[31]ణాః ।

---

1. మాను
2. రో
3. ర్లో
4. వర్వకావృద్ధిరేచక
5. క్రీడా
6. క్కా
7. న
8. న్మా
9. కా
10. మాను
11. వృద్ధ
12. వై
13. రో
14. చ
15. స్త
16. క్షణికో
17. ష్మా
18. రోత
19. భేదాలై
20. ను
21. చ
22. చ
23. ష్టే
24. నా
25. చ్చే
26. ష్ణవాజా
27. చి
28. ద్ర
29. టి
30. ఛ
31. ణః

అడ్డసరపు పువ్వుల రసములో గాని,

తిప్పతీగె కాడల రసములో గాని,

పిప్పళ్ళు [1]పేలాలు రేగు గింజల పప్పు, వీటి చూర్ణములో కాని

వెలగ పంటి ఆగరు, ఏలకులు,ల[2]వంగాలు, ఆకు పత్రికము,

ఇవిసమాంశలు. వీటి చూర్ణములో గాని తేనెగలిపి సేవిం[3]చిన సకల ఛర్దులు [4]నయమగును.

## బిల్వాదిలేహ్యము

శ్లో. బిల్వధాన్యకబలామ[5]హౌషధైః
లాజముద్గసహితైః [6]శృతం జలమ్ ।
ఛర్దిమాశు పిబతః సశర్కరం
నాశయేత్సకలదోషమాహరేత్ ॥

1. మారేడు వేరు, 2. ధనియాలు,
3. ముత్తువపులగపు వేరు, 4. శొంఠి
5. పేలాలు, 6. పెసలు,

ఇవి సమాంశలు. కషాయ[7]ము బెట్టి శర్కర గలిపి సేవించిన సకల[8]చ్ఛర్దులు [9]నయమగును.

శ్లో. త్రింశత్పలం బిల్వమూ[10]లం సార్ధకుంభే౽[11]oభసః పచేత్ ।
అష్టభాగావశే[14]షే౽స్మిన్ కషాయమవతారయేత్ ॥

---

1. వ్యాతచేతలు
2. త్ర
3. యివిదిన్నను
4. కింద
5. లు
6. ఊర్ధ్వగతమయితేహ్యాద యమువీపు కడుపుకింగడుపు తలయి నిన్నినొప్పిపుట్టించును శ్వాసం కాస జ్వరంఇవి ఉదావర్తము ప్రకోపిం చిన మపుట్టును
7. త్సి
8. త్సా
9. ఛ్యా
10. స్వే
11. యావసర్మణిః
12. ర్తానకు
13. హా
14. చేది

9. శేదనవర్తిపట్టించేది స్నేహావర్తిపుట్టించేది నానావిధాలానుమలం విడిపించేది.

1. ఛ
2. దా
3. నుప
19. ద్వపికా

త్రింశ[1]త్పలం గుడం దత్వా కించిత్పక్వే[2]ఽవ తారయేత్ ।
త్రి[3]పలం శృంగబేరస్య [4]మరిచస్య చతుష్పలమ్ ॥
పిప్పల్యాః [5]కుడవార్ధం చ [6]చవికాయాః ప్రకుంచకమ్ ।
ముష్టిం తాలీ[7]సపత్రస్య ము[8]ష్ట్యర్ధం [9]కేసరస్య చ ॥
[10]ద్వే పలే పిప్పలీమూ[11]లాచ్చి[12]త్రకస్య [13]పలం తథా ।
పృథక్ త్రిజాతకాత్కర్షం జీరకా[14]చ్చ [15]పలద్వయమ్ ॥
సంచూర్ణ్య[16] తస్మిన్ వికిరేత్ యుక్త్యా పుష్పరసం క్షిపేత్ ।
ఏష బిల్వాదికో లే[17]హః సర్వ[18]చ్ఛర్దినివార[19]ణః ॥
హృద్రోగకామిలాగుల్మగ్రహ[20]ణ్యరుచిపీనసాన్ ।
హిక్కాకాసక్రిమిశ్వాస ప్లీ[21]హానాహగళామయాన్ ॥
అర్శాంసి పాండురోగం చ [22]నిహన్యా[23]త్సుని[24]షేవితః ।

మారేడువేళ్ళు [25]30-పలములు [26]సార్ధద్రోణము నీళ్లలో పోసి అష్టభాగావశేషముగా కాచి ఆ కషాయములో బెల్లము 30-పలములు వేసి కలిపి సాంద్రపాక[27]ముగ కాచి అందులో[28]

1. శొంఠి 3-[29]పలములు, 2. పిప్పళ్ళు 2-[30]పలములు,
3. మిరియాలు[31]4-పలములు, 4. చవ్యం 1-[32]పలములు,
5. తాళిసపత్రము[33]1-పలము, 6. నాగకేశరాలు [36]½ పలము.

1. దాంశ
2. వ
3. ఫల
4. మా
5. కడు
6. చేవ్యకాయా
7. శ
8. ష్ట్యై
9. శేచ
10. త్వ్యఫ
11. లేచి
12. ఫ
13. చ
14. ఫ
15. ర్ణ
16. చహ్యా
17. ఛ
18. ణం
19. ణ్యా
20. హో
21. త
22. అ
23. త్కా
24. శే
25. తాం
26. ఫ 30
27. తూమెడు
28. ఫలా
29. ంగా
30. గలసేద్రవ్యాః
31. ఫలా
32. ఫ ౨
33. ర
34. ఫ ౧
35. ం థ ౧
36. ఫం౧౨

7. పిప్పలిమూ[1]లం 2పలములు. 8. చిత్రమూల[2]ము 1-పలము,
10. ఏలకులు [3]1-కర్షము, 11. ఆకుపత్రికము[4]1-కర్షము,
12 జీలక[5]ఱ్ఱ [6]2-పలములు,

వీటిని చూర్ణము చేసి కలిపి తేనె పోసి కలి[7]యబెట్టవలెను. [8]ఈ బిల్వాదిలేహ్యమును సేవించిన సకల[9]చ్ఛర్దులు [10]నయమగును.

హృద్రో[11]గము, కామిల[12]ము, గుల్మ[13]ము, గ్రహణి, అరుచి, పీనస, వెక్కిలు, కాస, క్రిములు, శ్వాస, ప్లీహ[14]ము, [15]ఆనాహము, గళరోగ[16]ము, మూలవ్యాధి, పాండురోగ[17]ము, ఇవన్నియు [18]నయమగు.

శ్లో. బిల్వార్ధాఢకమంభ[19]సోఽర్థకలశే ప[20]క్త్వా [21]పద[22]స్థే రసే
శుద్ధం జీర్ణగుడస్య షోడశపలం చూర్ణీకృతై[23]శ్చూర్ణితమ్ ।
కర్షాంశైర్ఘనధాన్యజీరకత్రుటీ[24]త్వక్కేసర[25]త్ర్యూషణైః
లీఢం ఛర్ద్యరుచిప్రశే[26]కసదనశ్వాసాగ్నిమాద్యం జయేత్ ॥

మారేడు వేళ్లు [27]32-పలములు [28]అర్ధద్రోణము నీళ్లలో వేసి కషాయము[29] బెట్టి నాలు[30]గవ భాగము మిగులు నట్లు కాచి ఆ కషాయములో పాత బెల్లము [31]16-పలములు గలిపి [32]మరల వడపోసి లేహ్యపాకము[38]గా కాచి అందులో

1. లం
2. ంఫ ౧
3. నె ౧
4. నె ౧
5. ర
6. ఫ 2 లాలు
7. యివి
8. అనుపానంగా
9. పి
10. యీా
11. ఛ
13. మాను
14. ం
15. ం
16. ం
17. ం
18. ఆనాహారం
19. ం
20. ం
21. యిన్నిన్నీ
22. మానుమ
23. సో
24. క్వా
25. త
26. స్తే
27. చూ్ఛ
28. పజ్వే
29. ధ్యూ
30. న
31. ౩ం ఫలాలు
32. తూమెడు
33. ం
34. గో
35. ము
36. ౧౬ పలాలు
37. తిరుగా
38. గా

1. ముస్తలు,
2. ధనియాలు,
3. జీలక[1]ఱ్ఱ,
4. ఏలకులు,
5. లవంగపు [2]చెక్క,
6. నాగకేసరాలు,
7. శొంఠి,
8. పిప్పలి,
9. మిరియాలు,

ఇవి కర్ష[3]మెత్తు చొప్పున చూర్ణము చేసి కలు[4]పవలెను.

[2]ఈ బిల్వాదిలేహ్యమును సే[5]వించిన సకల[6]చ్ఛర్దులు అరుచి [7]ప్రసేకము, శ్వాస, అగ్నిమాంద్యము [8]ఇవన్నియు నయమగును.

## తృష్ణానిదానము

శ్లో. జిహ్వాబహిర్గమనకర్కశకంఠజిహ్వ
కాంతిప్రలాపముఖశోషజలాభిలా[9]షాః ।
[10]అన్నారుచీంద్రియమనస్వరసాదతంద్రాః
సామాన్యలక్షణమిదం కథితం తృషా[11]యాః ॥

తృష్ణరోగ[12]ము నాలుక [13]వెలికివచ్చి, కంఠము జిహ్వ [14]కర్కశములై కాంతిచెడి, మాటలాడలేక, ముఖ[15]ము వాడి, జలాభిలాష కలిగి అన్నద్వేషము [16]కలిగి పం[17]చేంద్రియములు సత్వము చెడి మనస్సు చెడి [18]ఎలుగు రాచి తంద్ర కలిగియుండును.

### చికిత్స

శ్లో. సలాజం నారికేళాంబు దద్యా[19]త్తృష్ణోపశాంతయే ।
త[20]త్క్వథోష్ణోదకం వాపి [24]లాజాక్షౌద్రవిమిశ్రితమ్ ॥

---

1. ఱ
2. సులేఖం
3. పి
4. యా
5. స్తేను
6. ఛ
7. పీనస
8. యిన్నిన్ని మానును
9. ం
10. షా
11. ద్వేశేశనే
12. న్యా
13. ం
14. ఎలికరికి
15. ం
16. సరుసనై
17. ం
18. మై
19. యా
20. యొ
31. తృ
22. త్కాషో
23. జలా

టెంకాయ నీళ్లలో లాజ పొడి గలిపి[7] త్రాగిన నయమగును.

లేదా టెంకాయ ఉడక బెట్టి వెచ్చని నీళ్లలో లాజలను తేనె గలిపి త్రాగించిన తృష్ణ నయమగును.

శ్లో. [1]విదారీకేసరక్షౌద్రకృష్ణాజీరకదాడిమైః ।
లేహో[2]ఽయం శర్కరోపేత[3]స్తీవ్రతృ[4]ష్ణా[5]ముదస్య[6]తి ॥

1. నాగకేస[7]రములు,
2. నేలగుమ్మడి గడ్డ,
3. పిప్పళ్లు,
4. జీలక[8]ఱ్ఱ,
5. దానిమ్మకాయ,

ఇవిసమాంశలు. తేనె పోసి నూరి శర్కరతో సేవించిన తీవ్ర తృష్ణలు [9]నయమగును.

శ్లో. వ[2]టాగ్రగోక్షురక్షౌద్రలాజసక్తు[3]సితోత్పలైః ।
గుళికా వదనే న్యస్తా తీవ్రతృష్ణాముదస్యతి ॥

1. మఱ్ఱి చిగుళ్లు,
2. పల్లేరు వేళ్లు,
3. లాజలు,
4. బెల్లము,
5. కలువదుంప,

ఇవి సమాంశలు నూరి తేనె గలిపి [4]ఉండలు చేసి సేవించిన తీవ్రతృష్ణ[5]లు నయమగును.

శ్లో. క్షౌద్రేక్షురససంపిష్టైః మధుకోత్పలగోస్తనైః ।
నియతం క్షీరపానీయం తృష్ణా [6]శామ్యతి దారుణా ॥

1. ద్రాక్ష పండ్లు,
2. యష్టిమధుకము,
3. తెల్లకలువగడ్డ,

---

1. ష్ణమానును
2. లున్నా
3. గని
4. మానును
5. శితేభ
6. యం
7. ంతీ
8. ష్ణ
9. చ
10. రాలు
11. మానును
12. టళ్ళంగవిక
13. శి
14. పు
15. మానును
16. శా
17. ం
18. మానును
19 వంటకమున్నా
20. ణో
21. క్షు
22. త్తా
23. ప్ర
24. ష్ణు
25. కుంటె
8. మానును

ఇవి సమాంశలు నూరి చెఱకు రస[7]ము తేనె గలిపి సేవించిన తృష్ణరోగములు [8]నయమగును.

పథ్యము పాలు[10]అన్నము

శ్లో. క్షీరేక్షురసమృద్వీకక్షౌద్రసింధుగు[11]డోదకైః ॥
సవృక్షామ్లై[12]శ్చ గండూ[13]షస్తాలుశోష[14]ప్రణాశనః ॥

1. చెఱకురసము, 2. ద్రాక్షపండ్లు,

పాలతో గలిపి పుక్కిట బెట్టు[15]కొనిన నోరు ఎండుట [25]నయమగును.

లేదా బెల్లము కషాయములో చింతపండు సైంధవలవణము వేసి తేనె గలుపుకొని గండూషము చేసిన [1]నోరు ఎండుట [2]నయమగును.

# హృద్రోగనిదాన[3]ము

శ్లో. హృద్రోగః పంచధా దోషైః పృథక్సర్వైశ్చ జంతుభిః ।
వాతా[4]త్సశూ[5]లం హృదయం పిత్తా[6]ద్దాహసమన్వితం ॥
కఫతో[7]ఽతిగురు స్తబ్ధం సర్వతస్సర్వలక్షణం ।
తత్త్రాప్యజ్యం క్రిమిసందు[8]ష్టమతికండూసమన్వితం ॥

విరు[9]ద్ధములయిన ఆహారవిహా[10]రములచేత వాతాదిదో[11]షములు ప్రకోపించి [12]ఐదు వి[13]ధములైన హృద్రో[14]గములను [15]పుట్టించును.

వాయువుల[16]న పుట్టిన హృద్రో[17]గములో రొమ్మునొప్పి కలిగి యుండును,

పైత్య[18]మువలన పుట్టిన హృద్రోగము దాహము గలిగి యుండును

శ్లేష్మహృద్రోగములో దేహ[19]ము గురువై మ్రానుపడి యుండును.

---

1. చలివెలుపెంజేది
2. మానును
3. ః
4. శ్చ
5. ల
6. దా
7. తి
8. ష్ట
9. ద్ధా
10. రా
11. షా
12. అయి
13. ఛేదాల
14. గాలు
15. ని
16. ం
17. హృ
18. ం
19. ం
20. డు
21. మి
22. ం

త్రిదోషహృద్రోగ[20]ము మూ[21]డు దోషములయొక్క లక్షణములు గల్గి యుండును.

క్రి[22]ములవలన బుట్టిన హృద్రో[69]గములో మిక్కిలి తీట గలిగి యుండును.

త్రిదోషములవలన పుట్టిన హృద్రోగ[1]ము అసాధ్య[2]ము.

చికిత్స

శ్లో. లవణామ్లయుతం తైలం హృద్రోగే వాతికే పి[3]బేత్ ॥

నిమ్మపండ్లపులుసు సైంధవలవణమును నూనె గలిపి సే[4]వించిన వాతహృద్రోగము [5]నయమగును,

శ్లో. [6]శుంఠీ సౌవర్చలం హింగు దాడిమం చామ్లవేతసం ।
చూర్ణముష్ణాంబు[7]నా పేయం వాతహృద్రోగశాంతయే ॥

1. శొంఠి, 2. సౌవర్చలవణ[8]ము 3. ఇంగువ, 4. దానిమ్మ కాయ, 5. ఆమ్లవేతన[9]ము,

ఇవి సమాంశలు చూర్ణము చేసి క[10]ర్ష మెత్తు చొ[11]ప్పన వేడి నీళ్ళతో సేవించిన వాతహృద్రోగము [12]నయమగును.

శ్లో. ద్విస్థిరాకల్క సంమిశ్రం ఘృతమిక్షురసేన[13]చ ।
ద్రాక్షారసేన [14]సంపక్వం పిత్తహృద్రోగనాశనమ్ ॥

1. చెఱకురస[15]ము [16]4భాగమును, 2. ద్రాక్షపండ్లరసము 4 [17]భాగములు 3. నెయ్యి [18]1 భాగము, 4. కోలపొన్న, ముయ్యాకు పొన్నలను నేతికి ఎనిమి[6]దవ భా[7]గముగ కల్కముగ బెట్టి, కాచిన ఘృతమును సేవి[19]ంచిన పైత్యహృద్రోగము[20]లు నయమగును.

శ్లో. కృష్ణాశ[21]టీప్రతివిషా రా[27]స్నైరండహారీతకీ ।
చూర్ణం గోమూత్రతః పేయం కఫహృద్రోగశాంతయే ॥

---

1. ం
2.
3. ణద్భ
4. జి
5. సేవిస్తే
6. మానును
7. శొంఠి
8. వా
9. ం
10. హింగుపు
11. .నం
12. రవ
13. లెఖను
14. లక్క
15. వా
16. వా
17. ం
18. ర కుంచా
19. కుంచా
20. కుంచెడు
21. ౨ న్నా
22. దో
23. ం
24. స్తే
25. మానును
26. త
27. స్నాపథ్యాచక్షుతం

1. పిప్పళ్లు, 2. కచ్చూ[1]రములు, 3. అతివస 4. [2]సన్నరాష్ట్రిము, 5. కరక్కాయలు, 5. ఆముదపువేళ్లు,

ఇవి సమాంశలు చూర్ణము చేసి దినము క[3]ర్షమెత్తు చొప్పున గోమూత్రముతో సేవించిన శ్లేష్మహృద్రోగ[4]ములు నయమగును.

శ్లో॥ సకుష్ఠవేల్లం గోమూత్రం క్రిమిహృద్రోగనాశనమ్ ।

1. చంగల్వకోష్టు, 2. విళంగ[5]సారములు

వీటిని చూర్ణము చేసి కర్షమెత్తు గోమూత్రముతో సేవించిన క్రిమి హృద్రోగ[6]ము [7]నయమగును.

శ్లో॥ హారీతకీఫలయుతం సౌవర్చలసమన్వితం ।
ఘృతప్రస్థం జలే పక్వం సర్వహృద్రోగనాశనమ్ ॥

నీళ్లు [8]4 ప్రస్థములు, నెయ్యి [9]ఒక ప్రస్థము కరక్కాయ[10]లను సౌవర్చలవణము[11]ను నేతికి నాలుగవ భాగముగ చేర్చి కల్కముగ బెట్టుకొని కాచిన ఘృతము సేవించిన స[12]కలమైన హృద్రో[13]గములు [14]నయమగును.

## శూలనిదానము

శ్లో॥ వాతాద్వ[15]స్తౌ భవే[16]చ్ఛూలం పిత్తాన్నాభౌ విదాహవత్ ।
కఫాత్ హృ[17]చ్ఛూలహృల్లాసం సర్వరూపాన్వితం త్యజేత్ ॥

వాతమువలన బుట్టిన శూలలో పొత్తి కడుపు నొచ్చును.

పైత్యశూలలో బొడ్డున నొ[2]ప్పికలుగును.

---

1. రా
2. దాసప
3. రష
4. మానును
5. రా
6. ంఘా
7. నును
8. ౪ కుచా
9. కుంచెడు
10. లున్నూ
11. న్నూ
12. ర్వ
13. గా
14. మానును
15. స్థే
16. త్ఛూల
17. దేసము

శ్లేష్మశూలలో [1]గుండెలో నొప్పి కలుగును.

త్రిదోషముల వలన బుట్టిన శూల అన్ని లక్ష[2]ణములు గలిగి యుండును.

[3]త్రిదోషశూల అసాధ్యము,

### శూలచికిత్స

శ్లో. నాగవ[4]ల్లీదళరసం చిత్రతైలయుతం పిబేత్ ।
శూలా[5]ర్తో మృత్యుపాశేన కృష్యమాణోఽపి జీవతి ॥

తమలపాకుల రస[6]ముతో ఆముదమును గలుపు[7]కొని సేవించిన వెంటనే శూల తగ్గి, ఆసన్నమృత్యువు కలవాడైనను బ్రతుకును.

శ్లో. తీవ్రశూలనివృత్త్యర్థం పాయయేదుష్ణకాంజికమ్ ।
స్వేదయేత్సికతాపిండైః శృంగైర్వా శోణితం హరేత్ ॥

వేడిక[8]లిని ద్రాగిన తీవ్రమైన శూల[9]లైనను శమించును.

ఇసుకపొ[10]ట్లములతో కాచవలెను, కొమ్ముతో శూలగల చోటున నెత్తురును దీ[11]యవలెను. వత్రీమైన శూల[12]లైనను శమించును.

శ్లో. గోమూత్రవస్తిం గుల్మోక్తం నిరూహం వాపి దా[13]పయేత్ ॥

గుల్మచికిత్సయందు జెప్పిన గోమూత్రవస్తి నిరూహవస్తులను శూలలకు [18]చేయవచ్చును,

---

1. కి
2. చ్చును
3. గుండెలునొచ్చును
4. ణా
5. ఇదిఅసాధ్యః
6. ల్లి
7. బేత్
8. గ్రమి
9. ంతో
10. కసేవిస్తేను
11. మృత్యువుగొంపోలున ప్రాణికియైననువిడుచును శూలమానిబ్రతుకును
12. లి
13. మాసును
14. ట్లాలగాచేది
15. సేది
16. మాసును
17. హ
18. పెట్టేది

శ్లో. ఇత్యశాంతౌ భవేద్దాహః కార్యో వైద్యేన ధీమతా ।

[1]పైనచెప్పిన విధముగ చికిత్స చేసినను శూల తగ్గని యెడల శూలగల చోటున చురకలు వేయవలెను.

హింగ్వష్టకచూర్ణము

శ్లో. వ్యోషా[2]జమోద[3]యుత [4]జీరకయుగ్మసింధు
చూర్ణం సరామఠవిభాగమితి ప్రయుక్తమ్ ।
హింగ్వష్ట[5]కం జయతి హృజ్జఠరాంతరాళ-
శూలాని గుల్మగుదజగ్రహణీవికారా[6]న్ ॥

1. త్రికటు[7]కలు, 2. [8]ఓమము, 3. జీరకద్వయము 4. సైంధవలవణము, 5. [9]ఇంగువ.

ఇవి సమాంశలు చూర్ణము చేసి క[10]ర్ష మెత్తు చొప్పున వే నీళ్ళతో సేవించిన హృదయ శూల, గుల్మము, మూలవ్యాధి, గ్రహణి[11] ఇవన్నియు శమించును.

## ఉదా[12]వర్తనిదానము

శ్లో. [13]రూక్షైః కో[14]ద్రవముద్గ[15]జీర్ణచణకైః క్రుద్ధోఽనిలో[16]ఽధోవహా
ద[17]ధ్వా [18]మూత్రమలౌ విశో[19]ష్య కురుతే విణ్మూత్రసంగం తతః
హృత్పృష్ఠోదర[20]వస్తిమస్తకరుజాం సశ్వాసకాసజ్వరం
గచ్ఛ[21]న్మూర్ధ్వ[22]ముపైత్యనేన మరుతః కోపాదు[24]దావర్తరుక్ ॥

1. ఈచెప్పినక్రమాన మాన కుండెనాశూలగల చోటకోవలువేసేది
2 చ
3. దయితౌ
4. జీరయుగ్మ
5. కా
6. ం
7. కా
8. వోమం
9. హింగువు
11. రవ
12. యిన్నిన్నిమానును
13. న
14. రుక్షైః
15. క
16. జీ
17. ద్ధానహం
18. ద్వా
19. వర్తమలం
20. ధ్య
21. ద
22. న్మూ
23. మసాపినూనమనుజః
24. తాతే

రూక్షద్ర[1]వ్య సేవనవల్లను, ఆళ్లు, కొ[2]ఱ్ఱలు, పెసలు, జొన్నలు సెనగలు, [3]వీటిని అధికముగ తినుటవల్లను, వాయువు ప్రకోపించి [4]మూత్ర మలము[5]లను బంధించి, తిరుగంజేసి యెండించి, మలమూత్ర సంగమును కలుగజేయును. రొమ్ములలోను, వీపులోను, కడుపు, పొత్తి కడుపులలోను తలలోను నొప్పిని కలిగించుచు, శ్వాస, కాస, జ్వరము లతోకూడిన ఉదావర్తరోగమును కలిగించును.

తచ్చికిత్స

శ్లో. ఉదావర్తిసమ[6]భ్యజ్య [7]స్విన్నగాత్రముపాచరేత్ ।
సవర్తి రేచనస్నేహావస్తి[8]భిః శోధయేన్మలమ్ ॥

ఉదావర్త[9]రోగికి దే[10]హమున నెయ్యి పట్టించి కా[11]చవలెను: వర్తి, విరేచన, స్నేహావస్తి, వీటిని ప్రయోగించి ఏవిధముననైనను మలమును ప్రవర్తింప చేయవలెను.

శ్లో. గోమూత్రరా[12]శఫల[13]రామఠదంతినీభిః
కంకుష్ఠసైంధవబిడైశ్చ గుడప్రగాఢైః ।
ఆగారధూమసహితైరితి వర్తిరేషా
న్యస్తా [18]గుదే గ్రథిత[19]విడ్గదజామయఘ్నీ ॥

1. వ్యాచేతనుల
2. ర
3. యివిదిన్నను
4. కిందు
5. లు
6. ఊర్ధ్వగళమయి తేహృదయమువీపు కడుపుకింగడుపుతలయి నిన్నినొప్పిపుట్టించును శ్వాసంకాసజ్వరంఇవిఉదావర్తముప్రకోపించిన మపుట్టును
7. త్వి
8. త్సా
9. భ్య
10. స్వే
11. యావసర్మణిః
12. త్గానకు
13. హః
14. చేది
15. బేదనవర్తిపెట్టించేది స్నేహావర్తిపుట్టించేది నానావిధాలానుమలంవిడిపించేది
16. శ
17. దా
18. నుప
19. ద్వపికా

1. మంగపండ్లు, 2. దంతిచెక్క, 3. [1]ఇంగువ, 4. కంకుష్టము, 5. సైంధవలవణము, 6. బిడాలవణము, 7. బెల్లము. 8. కరుధూపము,

యివి సమాంశలు గోమూత్రము పోసి నూరి [2]గుడ్డతో వర్తిని జేసి ఆ వ[3]ర్తికి మందు పట్టించి ఆ వ[4]ర్తిని ఆస[5]నములో నెక్కించిన మల ప్రవృత్తి కలుగును.

శ్లో. త్రివృత్కృష్ణాహరీతక్యః త్రిచతుఃపంచభాగికాః ।
గుళికా [6]బదరైస్తుల్యా వి[7]డ్విబంధగదా[8]పహా ॥

1. తెగడచెక్క [9]3 భాగములు 2. పిప్పళ్లు [10]4. భాగములు 3. కరక్కాయ [11]5 భాగములు

[12]వీటిని కలయబోసి నూరి ఉండలు చేసి [13]సేవించిన [14]మల బంధము తగ్గును.

శ్లో. అభయాత్రి[15]వృతాఖల్వా స్తద్యామం పిప్పలీ[16]యుతం ।
మిశ్రం [17]శితముదావ[18]ర్తం [19]నాశయేత్ త్రిదినాని చేత్ ॥

1. కరక్కాయలు, 2. తెగడచెక్క, 3. ఉలవలు

ఇవి సమాంశలు కషాయము బెట్టి పిప్పలి పొడి గలిపి మూడు దిన[20]ములు సేవిం[21]చిన ఉదావర్తము [22]నయమగును.

---

1. హింగువు
3. కోకనుపత్తి
3. తికి
4. త్త
5. అందునకట్టిమలంవెళ్లును
6. గరుతుల్యాః
7. డ్భి
8. వ
9. భా 3
10. భా ४
11. భా ౫
12. యివి
13. ఆసనములో బెట్టినను
14. బద్ధమలంవిడుచును
15. స్ఛతుక్కుఖుద్దా
16. యుజా
17. బిత
18. ర్తం
19. నశ్యతి
20. నా
21. స్తే.
22. మానును

శ్లో. గోమూత్ర ద[1]ధ్న్యబు తుషాంబు తైలం
చత్వారి తాని ప్రసృతాన్వి[2]తాని ।
వస్తిం నృణాం సర్షపకల్కయుక్త-
మానా[3]హవిట్సంగహర[4]ం ప్రసిద్ధమ్ ॥

గోమూత్ర[5]ము 2 పలములు 2. పెరుగుమీఁది నీళ్లు 2 పలములు 3. పసగడుగు [6]2 పలములు 4. ఆముదము [7]3 పలములు వీటినన్నిటిని కలిపి అందులో రెండు క[8]ర్షముల యెత్తు ఆవాలు నూరి గలిపి వస్తి పెట్టినను అనాహాము ఉదావర్తము, మలబద్ధ[9]ము ఇవి నయమగును.

## ఆనహానిదానము

శ్లో. ఆనాహమిత్యుగ్రరుజం సశబ్దం
వృద్ధా నితేనోభయమార్గరో[11]ధాత్ ॥

విరు[12]ద్ధములైన అన్నపానాదులచేత వాయువు ప్రకోపించి మల మూ[13]త్రములను బంధించి పేగులలో అఱుపులు, కడుపులో నొప్పి కలిగి యుండును. ఈ లక్షణములు కలిగి యుండిన ఆనాహమని చెప్పుదురు.

శ్లో. [14]ఆనాహినముదావర్తవిధినా సముపాచరేత్ ।
ద్వావిమౌ తు విశేషేణ చూర్ణేనాగ్నిముఖేన చ ॥

[15]ఆనాహమునకు ఉదావర్త చికిత్సను [16]చేయవలెను. అగ్ని ముఖచూర్ణమును ఆనాహ ఉదావర్తములలో ప్రయోగిం[20]చవలెను.

---

1. ద్యా
2. యా
3. విష
4. నినిఘ్నం
5. ప ౨
6. ప ౨
7. ప ౨
8. ఫ 3
9. కూడాను
10. ర్షా
11. ంమానును
12. ం
13. ద్ధా
14. అల్పోబ్బవుయుక్తే జ ఠ రేయ దిస్యా దావాహ మోర్యావ పరిక్షయేచ
15. దా
17. త్రాదులు కట్టిరచు
18. అనాహె
19. హ
20. సేది
21 చేసి

## ఏరండా[1]దిస్వేదము

శ్లో. ఏరండార్కకరంజమోరటబలాతర్కారిసోమస్నుహీ
నిర్గుండీతలపోటశిగ్రువరుణాంకోలాశ్వగంధాచ్ఛదైః ।
విష్టైఃకాం[2]జికమూత్రవర్గసహితైః [3]క్వాథీకృతైస్తైః కృతః
[4]స్వేదః క్రూరసమీరణా[5]ర్తవపుషాం సద్యస్సుఖో వాతహా ॥

1 ఆముదపు ఆకు, 2 జిల్లేడు ఆకు,
3 కానుగ ఆకు, 4 చేగొణిదె ఆకు,
5 ములుగోరింటాకు, 6 తెక్కలాకు,
7 కారుగచ్చాకు, 8 చెముడాకు,
9 వావిలాకు, 10 తంగేడాకు,
11 కారుమునగాకు, 12 ఉలిమిరాకు,
13 ఊడుగాకు, 14 పెన్నేరాకు,

ఈ యాకులను సమాంశలుగ గూర్చి త్రొక్కి కడవలో బెట్టి అందులో కలి, గోమూత్రము, గేదె పంచితము, మేక పంచితము, వీటిని కూడబోసి ఉడక బెట్టి దేహమున బట్టించిన వాతరోగములు [7]నయమగును.

## బంధ[8]నములు

శ్లో, స్నిగ్ధోష్ణవీర్యై[9]ర్మృదుభిఃకౌశేయావిక[10]శాటకైః ।
అలాభే వాతజిత్పత్త్రైః స్నేహాలేపేన బంధ[11]నమ్ ॥
రాత్రౌ [14]బద్ధం దివా ముంచేత్ ముంచేద్రాత్రౌ దివా కృతమ్ ।

---

1. పంచశాక
2. ష్టి
3. చ
4. స్వే సేషుటసితక్కృత
5. శే
6. ర్థ
7. శ
8. మాసతి
9. ర్భి
10. మృ
11. తతః
12. చాకూతైః
13. నాత్
14. ంధం

1 ఇత్తి, 2 లేడి, 3 దుప్పి, 4 దుసబోతు,

వీటితో[1]ళ్లు తెచ్చి, కంపు లేకుండ చేసి చమురు పట్టించి ఎండనిచ్చి [2]నొప్పిగలచోటున ఆ తోలు వేసి [3]కట్టవలెను, పగలు కట్టి రాత్రి [4]విప్పి వేయవలెను. రాత్రి కట్టి పగలు [5]విప్పివేయవలెను. చర్మములు [6]లేనియెడల వాతహా[7]రములులైన ఆకులు వేసి క[8]ట్టవలెను.

వేదా [9]కంబళి బట్ట[10]తో నైనను, [11]గట్టవలెను.

# రక్తవాత నిదానము

శ్లో. సంధి[12]నిస్తోదయుక్ శో[13]ఫః సకండూ ర్వాతశోణితమ్ ।
గంభీరోత్తానభేదేన ద్వివిధం క్షయవృద్ధి[14]మత్ ॥

రక్తవా[15]తములో కీళ్లువాచి, నొప్పిగలిగి, దురదగలిగి యుండును. [16]ఆ వాతరక్తము గంభీరమనియు, ఉత్తానమనియు రెండు [17]విధములు.

## చికిత్స

శ్లో. [18]శు క్తిభిర్వా జలూకా[19]భీ రక్తం విస్రావయే[20]న్మహుః ।
[21]గోక్షీరై రండతైలేన స[22]హాతక్రేణ రేచయేత్ ॥

రక్తవాతము[23]లో వస్థలమున వాపుగలిగియుండునో [24]అస్థలనము కత్తిచాట్లు వేసి [25]ముత్యపు చిప్పలతో గీచి నెత్తురు [26]తీయవలెను.

లేదా జలగ[27]లచేత [28]నైనను నెత్తురు [32]తీయించవలయును.

---

1. ౹ రి
2. నొచ్చేఆక్కడ
3. ట్టించేసి
4. విడిచేది
5. చర్మాలు
6. కుండేనా
7. రా
8. ట్టించేది
9. లేదా చరికో కనైనా కట్టనిచ్చేది
10. గొంగళి
11. నైనా
12 గట్టించ్చేది
13. ం
14. విరోధిరిణ
15. థ
16. యేత్
17. తాన్ను
18. అది
19. భేగాలు
20. వోదీబుట్టి పైకి భేదించును మీద బుట్టి వివర్ణం చేయించెదిన్ని
21. కే
22. ని
23. ర్మ
24. ముపల
25. చయత్నేన
26. కుఎక్కడయిస్తే
27. ఆక్కడ
28. కాకిచిప్పను
29. తీసేది
30. చా
31. నయినా
32. దీఖుంచేది

